# జీవితము - మతము

## టాల్‌స్టాయ్ వ్యాసావళి




అనువాదం:

బెల్లంకొండ రామదాసు

卐

రవీంద్ర గ్రంధమాల, విజయవాడ-2.

# JEEVITHAMU - MATHAMU

Selections from

## ON LIFE AND ESSAYS ON RELIGION

by

LEO TOLSTOY

Telugu Translation by :

BELLAMKONDA RAMADAS



First Edition: Sept. 1959.
5,000 Copies, PRICE Re- 1-15

PUBLISHED UNDER THE AUSPICES OF THE SOUTHERN LANGUAGES BOOK TRUST.
TELUGU - 38

PUBLISHERS:
RAVINDRA GRANDHA MALA,
VIJAYAWADA - 2

Printed at DESI PRESS, Vijayawada - 2.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షణీయంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భారత పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్టు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల మానవజీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహా పురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్ని పాట్లు పడినదీ ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం—ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు, కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, విరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈపరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయాలను గురించిన

ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవు. ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపచేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులనుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తి పరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7-10-1958

ఇట్లు,
డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

# ఉపోద్ఘాతము

"పంథొమ్మిదవ శతాబ్దిలో మానవుడు సాధించిన లౌకికాభ్యుదయం వాస్తవంగా చాలా గొప్పది. అయితే, అది ముఖ్యమైన నైతిక ప్రమాణాలను బలిపెట్టి సాధించిన అభ్యుదయం. ఛెంగిజ్‌ఖాన్, అటిల్లా, నీరోల నాటినుండి నేటివరకూ నైతిక ప్రమాణాలను ఇంత దారుణంగా తృణీకరించిన ఘట్టం చరిత్రలో మరొకటి కనుపించదు"—అంటాడు కౌంట్ లియో టాల్‌స్టాయి "మతమంటే ఏమిటి?" అనే వ్యాసంలో. టాల్‌స్టాయి (1828—1910) మానవజగత్తును ఎదుర్కొంటున్న సమస్యలను నిశితంగా పరిశీలించిన మేధావి. ఆయన పరిశీలన పర్యవసానములైన అభిప్రాయాలలో ముఖ్యమైనవన్నీ ఈ గ్రంథంలోని వివిధవ్యాసాలలో వ్యక్తం చేయబడినవి. బ్రాహ్మణ, కన్‌ఫ్యూషియన్, టావో, హీబ్రూ, బౌద్ధ, మహమ్మదీయ మతాలలోని ప్రాతిపదిక సిద్ధాంతాలతో (బాహ్య కర్మకాండలతో కాదు) ఏకీభవించే క్రైస్తవమత సిద్ధాంతాలే నిజమైన మతమని టాల్‌స్టాయ్ అభిప్రాయం. "సర్వవస్తువులకూ మూలభూతుడైన భగవంతుడు ఒకడు ఉన్నాడు; ఆ మూలజ్యోతిలోని ఒక్కొక్క స్ఫులింగం ప్రతి మానవునిలోను వెలుగుతున్నది; మానవుడు తన జీవన విధానం వలన ఆ స్ఫులింగాన్ని ఉద్దీప్తం చేసుకొనడానికి, నిస్తేజం చేసుకొనడానికి కూడా వీలున్నది. దాన్నిఉజ్వలం చేసుకోవాలంటే మానవుడు తన అంతశ్శత్రువులైన కామ క్రోధాలను నిగ్రహించుకొని, ప్రేమ సౌహార్దాలను వృద్ధిచేసుకోవాలి; ఇతరులు నీపట్ల ఏ విధంగా ప్రవర్తించాలని ఆశిస్తున్నావో ఆవిధంగా నీవు వారియెడ ప్రవర్తించడమే అందుకు

ఆచరణీయమైన సాధనమార్గం — ఇవే సర్వమత సమ్మతములైన ఆ ప్రాతిపదిక సిద్ధాంతాలు" అంటాడు టాల్‌స్టాయి. "మతమంటే ఏమిటి?" "మతానికీ నీతికీ గల సంబంధం ఏమిటి?" "మతానికీ హేతువాదానికి గల సంబంధం ఏమిటి?" అన్న ప్రశ్నలకు ఈ గ్రంథం ఇస్తూన్న జవాబులు మానవజాతికి నిరంతర మార్గదీపికలు.

మద్రాసు,
22 జూన్ 1959

వి. ఏ. దేవసేనాపతి.

# విషయ సూచిక:

# 1

## మతమంటే ఏమిటి?

మానవ చరిత్రలో మతాల పాత్రను పరిశీలిస్తే మనకు ఒక విషయం స్పష్టంగా తెలుస్తుంది.

మతాలు స్థాపించబడేటప్పుడు ఒక ప్రత్యేకమైన ప్రయోజనంతో స్థాపించబడుతాయి. కాని రానురాను కాలం జరిగేకొద్దీ మతాలు ఆ ప్రయోజనానికి దూరమై కత్తుల బోనుల్లాగా తయారవుతాయి. అంతేకాదు, తొలిగా మతాన్ని స్థాపించేటప్పుడు ఉద్దేశింపబడిన ప్రయోజనం పూర్తిగా విస్మరింప బడుతుంది. మనుష్యులపైన, వారి జీవితాలపైన మతాల ప్రభావంకూడా సన్నగిల్లుతుంది.

చరిత్రలో ఇలాంటి దశ వచ్చినప్పుడు, చదువుకున్న వారికీ మేధావులకూ మతంలో నమ్మకం పూర్తిగా సడలి పోవడం సంభవిస్తుంది. కాని, ఆ విషయాన్ని పైకి కనిపించ

నీయరు. మతంలో నమ్మకం ఉన్నట్లుగానే పైకి నటిస్తారు. సాధారణ ప్రజానీకం ఉన్న జీవన వ్యవస్థపై తిరుగుబాటు చెయ్యకుండా ఉండేందుకు వీరిలా మతంలో విశ్వాసం ఉన్నట్లు నటిస్తారు. ఇక, సాధారణ ప్రజానీకం తరతరాల నుంచి వస్తున్న మూఢ విశ్వాసంవల్ల మతానికి కట్టుబడి ఉన్నప్పటికీ వారి జీవితాలను తీర్చిదిద్దుకునే విషయంలో మటుకు మతాన్ని ఏ విధంగానూ అనుసరించరు. సాంఘికాచారాలను, ప్రభుత్వ శాసనాలను మటుకే అనుసరిస్తూ ఉంటారు. ప్రతి దేశంలోను, ప్రతి మానవ సమాజంలోను, ఇలాంటి దశ ఉత్పన్నం కావటము, ఇలాంటి సంఘటనలే జరగడము మనకు కనుపిస్తూనే ఉంటుంది. కాని ప్రస్తుతం మన క్రైస్తవ సమాజంలో జరుగుతున్న వైపరీత్యం ఇంతకుముందు ఎక్కడా జరుగనట్టిది. ప్రస్తుతం మన సమాజంలో అధికారంలో ఉన్నది మేధావులూ, శ్రీమంతులూ. వీరి ఆదేశాలను, ఆశయాలనే సామన్య ప్రజానీకంకూడా హర్షించి అనుసరిస్తారు. కాని వీరు, తమకు మతంలో విశ్వాసం సడలినట్లు పైకి కనుపించనీయరు. అలా కనుపించనిస్తే ప్రజలు ఉన్న వ్యవస్థపై తిరుగుబాటు చేస్తారని వీరి భయం. అందుచేతనే మతంలో గాఢమైన విశ్వాసం ఉన్నట్లే నటిస్తారు.

వీరికి మతంలో విశ్వాసం నశించడమే కాకుండా మతం కేవలం అనవసరమైన దనే విశ్వాసం ఏర్పడింది. మత

ప్రాధాన్యానికి ఇవి రోజులు కావని, మతాల ప్రభావం పని చేసే రోజులు గడిచిపోయాయని, మతం ప్రస్తుతం దేహం లోని ఒక శిథిలాంగంలాగా అనావశ్యకమని వీరి అభిప్రాయం.

మతం ఒక ఆంతరంగిక అనుభూతి అనీ, ఆ అనుభూతి ద్వారా ఎరుకపడే ఒక సత్య స్వరూపమనీ వీరు విశ్వసించరు. మతం అనేది కొందరు వ్యక్తులను తారుమారు చేసే వెర్రి నమ్మకమని వీరు భావిస్తారు. ఒక శారీరకరోగం యొక్క స్వరూపాన్ని కొన్ని బాహ్య లక్షణాలద్వారా కనిపెట్టినట్లు గానే మతం యొక్క స్వరూపాన్ని కొన్ని బాహ్య లక్షణాల ద్వారా కనిపెట్టవచ్చునని వీరి అభిప్రాయం.

వీరిలో మతాన్ని గురించి రకరకాలైన అభిప్రాయా లున్నాయి. ప్రకృతియొక్క వివిధ వ్యక్త స్వరూపాలకు వెనుక ఒక అవ్యక్త శక్తి ఉన్నదని భావించడమే మతం యొక్క పుట్టుకకు కారణమని వీరిలో కొందరి అభిప్రాయం.

చనిపోయిన పితృపితామహుల భూత ప్రేతాలతో సంపర్కం కలిగించుకోవడం మతమని మరి కొందరి భావన.

ప్రాకృతిక శక్తులను అర్థంచేసుకోలేక వాటికి భయ పడడం వల్లనే మతం పుట్టిందని మరి కొందరి వాదన.

కాని ఇప్పుడు కాలం మారింది. శాస్త్రజ్ఞానం అభి వృద్ధి చెందింది. చెట్టుకూ పుట్టకూ ఆత్మ పదార్థం ఉండదని,

ఇహ లోకంలోని జీవుల జీవన గమనం మృతజీవులకు తెలియడం అసాధ్యమని, ప్రకృతిని శాస్త్రరీత్యా పృథఃకరించి అర్థం చేసుకోవచ్చునని, శాస్త్రం ఋజువు పరిచింది. అందుచేత మతంతో ప్రజలకు అవసరం గడిచిపోయిందని ప్రస్తుత మేధావుల విశ్వాసం.

మతధర్మాలకు ఈనాడు ప్రాముఖ్యం లేదనికూడా వీరు భావిస్తారు. ఈ మేధావుల ఉద్దేశంలో మానవ చరిత్రలో ఒక అజ్ఞాన దశ ఉన్నది. ఆ అజ్ఞాన దశలోనే మానవులు మతాలను అనుసరించారు. ఆ దశ ఏనాడో గడిచిపోయింది. ఈ నాడు మానవజాతి ఎంతో పురోగమించింది. ఆ దశ తాలూకు చిహ్నాలు కొన్ని చెదురు చెదురుగా మిగిలి ఉన్నప్పటికీ ప్రస్తుత మానవజాతి ఉన్న వైజ్ఞానిక దశకూ ఆ నాటి దశకూ ఎలాటి సంబంధమూ కనుపించదు. ఆ తరువాత మానవ చరిత్రలో మరొకదశ వచ్చింది. అది ఆధ్యాత్మికవాద దశ. ఈ దశలో మానవజాతి ఆధ్యాత్మిక వాదాన్ని విశ్వసించింది. కాని మానవజాతి ఈ దశనుకూడా అధిగమించింది. ఈ యుగం వేరు. ఇది శాస్త్రయుగం. శాస్త్రం మానవ మేధస్సునూ మానవ నాగరికతనూ ఉన్నత శిఖరాలకు చేరుస్తుంది. మత విశ్వాసాలతో క్రమ్మినంతకాలం మానవుడు ఈ ఉన్నత శిఖరాలను పోలిక పట్టడం కూడా అసాధ్యం.

1901 సంవత్సర ప్రారంభంలో ఫ్రెంచి మేధావి బెర్తె లాట్ ఒక మహోపన్యాసాన్ని కావించాడు. మతానికి రోజులు గడిచిపోయాయని, ఈనాడు మతం స్థానే శాస్త్రానికి పట్టం కట్టాలనీ ఈయన తన ప్రసంగంలో పేర్కొన్నాడు. ఈ భావాన్ని వెలిబుచ్చిన తొలి ప్రసంగం ఇదే కావడం వల్లనూ, అదీకాక మేధావులందరికీ కేంద్రంగా భావించబడే ఫ్రాన్సుదేశంలో విశ్వవిఖ్యాతి నందిన ఒక మేధావి ఇలా ప్రసంగించడం వల్లనూ ఈ విషయాన్ని నేను ప్రత్యేకంగా ఉదహరించడం జరిగింది.

కాని ఇదేభావాన్ని మరెందరో మరెన్నో విధాలుగా వ్యక్తీకరించారు. ఈ భావాన్ని మేధావులూ, వేదాంతులూ వ్యక్తీకరించడంమాట అలాఉంచి ఆఖరుకు వార్తాపత్రికలలో కూడా ఈ భావం ప్రచారం చెయ్యబడుతూ ఉన్నది.

శాస్త్రవిజ్ఞానం అవతరించడానికి పూర్వం మానవ జాతి గమనాన్ని శక్తి – మతం అనేరెండు శక్తులు నడుపుతూ వచ్చినవని, ఈనాడు వాటితో నిమిత్తంలేకుండా పోయిందనీ బెర్తెలాట్ తన ప్రసంగంలో పేర్కొన్నాడు. శాస్త్రవిజ్ఞాన మనే మాటను పేర్కొనడంలో బెర్తెలాట్ ఉద్దేశం, మానవ పరిజ్ఞానావధికి సంబంధించిన విషయాలనన్నిటినీ సమన్వయించి, తద్వారా శాస్త్రం చెప్పే నిర్వచనం సర్వవిధాలా సత్య మన్నదే. కాని ఇలాటి శాస్త్రవిజ్ఞానం ఉండడం అసంభవం.

ఈనాడు సాధారణంగా శాస్త్రవిజ్ఞానమని పరిగణించ బడుతున్నది సమగ్రం కాదు. అసంబద్ధంగానూ, చెదురు మదురుగానూ ఉన్న కొన్ని విజ్ఞానశాఖల సముదాయం మాత్రమే - ఈనాడు శాస్త్ర విజ్ఞానంగా పరిగణించ బడుతూ ఉన్నది. అదీకాక, ఈనాడు శాస్త్ర విజ్ఞానంవల్ల తెలుసుకున్న సత్యాలు కేవలం నిష్ప్రయోజన మైనవి మాత్రమేకాక ఈనాడు సత్యమని నిరూపింపబడిన విషయం రేపటికి అసత్యంగా పరిగణింపబడుతూ ఉన్నది. అందుచేత మతం స్థానే శాస్త్రానికి పట్టంకట్టాలనే బెర్ట్రెలాట్ వాదం అసమంజసం మాత్రమేకాకుండా చర్చి నిర్దుష్టతతో కొందరికిగల మూఢ విశ్వాసంవలెనే శాస్త్ర పరిజ్ఞానం నిర్దుష్ట మైనదని మూఢంగా విశ్వసించడంపై ఆధారపడింది.

కాని, మేధావు లనబడేవారు మాత్రం ఈ వాదాన్ని విశ్వసిస్తున్నారు. మతం యొక్క స్థానాన్ని శాస్త్ర విజ్ఞానం ఆక్రమిస్తుందని వీరి నమ్మకం.

'మతం ఒక మూఢవిశ్వాసం. శాస్త్రజ్ఞానాన్ని తప్ప మరి దేన్నినమ్మినా అది కేవలం అజ్ఞానం. శాస్త్రవిజ్ఞానం మానవ జీవితానికి సంబంధించిన సర్వ విషయాలనూ సమన్వ యిస్తుంది. అంతేకాక, శాస్త్ర విజ్ఞానం ఒక్కటే మానవునికి సరియైన మార్గదర్శి—' అని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. శాస్త్ర విజ్ఞానంలో పరిచయంలేని సామాన్యులుకూడా ఇదే

విషయాన్ని విశ్వసిస్తున్నారు. కాని ఈ విశ్వాసం ఎంత మాత్రం సమంజసంకాదు. ఎందుచేతనంటే శాస్త్ర విజ్ఞానం సర్వ సమగ్రమని భావించడం అసంబద్ధం కాబట్టి, మానవునికి ఆ విజ్ఞానం మార్గదర్శి కావడం కూడా అసంభవము.

## 2

మతంతో ఈనాడు మానవజాతికి అవసరంలేదని, మతంయొక్క స్థానాన్ని శాస్త్రవిజ్ఞానం ఆక్రమించినదనీ ఈనాటి మేధావులు నమ్ముతున్నారు. కాని మానవసమాజం కాని, వివేచనాజ్ఞానంకల మానవుడుకానీ మతం వినా మనగలగడం అసాధ్యం, అసంభవం. వివేచనాజ్ఞానం గల మానవుడు మతం వినా మనలేడని అన్నాను. ఎందుచేత నంటే, వివేచనా జ్ఞానం లేని మానవుడు పశువుగా జీవించ వచ్చుకాని వివేచనగల మానవుడు అలా జీవించడు. వివేచన గల మానవునికి జీవితంలో సరియైనబాట చూప గలిగింది ఒక్క మతమే. ఏది కార్యము ఏది అకార్యము అన్న విష యాన్ని కూడా మతం ద్వారానే మానవుడు తెలుసుకోన గలుగుతాడు. సదసద్వివేచన మానవుని సహజ లక్షణం. అందుచేత మానవుడు మతం వినా జీవించడం అసాధ్యం. తను చేసే కార్యాల ఫలితాలను దృష్టిలో ఉంచుకుని ప్రతి జంతువూ కర్మచేస్తుంది. ఈఫలితాలను విస్మరించి ఏజంతువూ

కర్మ చేయడ మన్నది జరుగదు. ఈ ఫలితాలకు అనుగుణంగా మాత్రమే కర్మ నిర్ణయింపబడుతుంది. ఉదాహరణకు ఒక తేనెటీగ ఉన్నదనుకోండి. తేనెటీగ తన నూతన సంతానానికి, చలికాలానికి కూడా సరిపడే ఆహారాన్ని ముందుగానే కూడ బెట్టుకుంటుంది. తేనెటీగ తేనెకొరకు పూలమీద వాలినప్పుడు ఇదొక్కటే ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకుంటుంది. గూళ్ళుకట్టే పక్షుల దృష్టికూడా ఇదే. ప్రతి జంతువూ ఇలాగే తన భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుంటుంది.

మానవుని విషయంలో మటుకు ఈ ధర్మం వర్తించదు. మానవునికీ జంతువుకూ దృష్టి భేదం ఉన్నది. జంతువు సహజ ప్రేరేపణలను అనుసరించి జీవయాత్ర సాగిస్తుంది. మానవుడు అలాకాదు. మానవుడు ఏపని చెయ్యాలన్నా తన వివేచనా జ్ఞానాన్ని ఉపయోగిస్తాడు. తేనెను పోగుచేసే తేనెటీగకు తేనెను పోగుచేయడం ఉచితమా అనుచితమా అన్న సందేహం కలగదు. కాని పంటకోతలు కోసే మానవునికి ఈ సందేహం కలుగుతుంది. తను పంటలు కోయడంవల్ల భవిష్యత్తులో పంటలకు ముప్పు కలుగదుకదా, ఇతరుల పంటను అపహరించడం కాదుకదా అని మానవుడు ఆలోచిస్తాడు. తన బిడ్డల భవిష్యత్తునుకూడా మానవుడు ఆలోచిస్తాడు. మానవుడు చేసే ప్రతి పనికీ ఫలితాలు అసంఖ్యాకంగా ఉండడంవలన ఇదమిత్థమని ఏ విషయాన్నీ మానవుడు తేల్చి చెప్పలేడు.

జీవితంలోని ప్రధాన సమస్యలను పరిష్కరించుకోవలసి వచ్చినప్పుడు, వ్యక్తిగత ప్రేరణలను కానీ, లేక తన పని తాలూకు ఫలితాలనుకానీ మానవుడు దృష్టిలోకి తీసుకోనడు. ఇందుకు కారణాలు లేక పోలేదు. మానవుడు చేసే ప్రతిపనికీ అసంఖ్యాకమైన ఫలితాలు ఉంటాయి. ఈ ఫలితాలుకూడా ఒక తీరుగా ఉండవు. ఒక్కొకసారి, ఒక ఫలితానికి మరో ఫలితం విరుద్ధంగా కనుపిస్తుంది. తన క్షేమానికీ ఇతరుల క్షేమానికీ భంగకరంగా కనుపించే పరిస్థితులు కూడా ఏర్పడు తాయి. ఈ సందర్భంలో ఒక కథ చెబుతాను:

ఒక దేవత భూలోకంలో అవతరించి, ఒక భక్తుని కుటుంబంలో-ప్రవేశించి ఆ ఇంట్లో ఊయలలో నిద్రిస్తున్న ఒక బిడ్డను చంపిందట. ఇలా ఎందుకు చేసినట్లని ఆ దేవతను ప్రశ్నింగా, ఆ బిడ్డవల్ల భవిష్యత్తులో ఆ కుటుంబానికి అనేక అరిష్టాలు కలగనున్నవి గనుక అలా చేయవలసి వచ్చిందని సమాధానం చెప్పిందట దేవత.

ఈ విధంగానే విజ్ఞుడైన మానవుడు జీవితంలోని ప్రధాన సమస్యలను తాత్కాలిక ఫలితాలనుబట్టి నిర్ణ యించడు. దూరదృష్టితోనే ఒక సమస్యను పరిష్కరించి నిర్ణయించడానికి యత్నిస్తాడు. జంతువులలో తనూ ఒక జంతువునేనని మానవుడు భావించవచ్చు. ఏనాటి సుఖాన్ని ఆనాడే అనుభవించడానికి తాను యత్నించవచ్చు. ఒక

కుటుంబంలోకాని, సంఘంలోకాని, లేక ఒక జాతిలోకాని, తాను సభ్యుడననికూడా అనుకోవచ్చు. ఈ అనంత విశ్వంలో తాను ఒక అణువని భావించవచ్చు. అందుచేతనే విజ్ఞుడైన ప్రతి మానవుడూ తను చేయబోయే కార్యాన్ని- సద్యః ఫలితాలను మాత్రమేకాక, విశాల విశ్వంతోగల సంబంధాన్ని యావత్తూ దృష్టిలో ఉంచుకుని చేస్తాడు. ఈ సంబంధమే మత మని పిలువబడుతూ ఉన్నది. అందుచేతనే విజ్ఞుడైన ప్రతి మానవుడూ మనగలగడానికి మతం అత్యావశ్యకం.

## 3

మానవుణ్ణి జంతువునూ వేరుచేసే ప్రత్యేక లక్షణం చైతన్యం. చైతన్యంగల ప్రతి మానవుడూ మతాన్ని తొలి నాటినుంచీ ఈ విధంగానే అర్థంచేసుకుంటూ వచ్చాడు. అతీతమైన ఈశ్వరశక్తికి కట్టుబడి ఉండటమే మతం. మతం భగవంతునికీ మానవునికీ మధ్యగల లంకె. మతమనే నిర్వచనం ఈనాటిది కాదు. వావెనార్గస్ నిర్వచనంకూడా ఇదే. షిలర్ మాషర్, ఫెయర్‌బాలుకూడా ఇదే నిర్వచనాన్ని చెప్పారు. ఈశ్వరునికీ మానవునికీ గల సంబంధమే మతమని ఫెయర్‌బా నిర్వచించాడు. మానవాత్మ పరివేదన వల్లనే మతం ఆవిర్భవించిందని మరొక నిర్వచనం. మానవుడు తను ఆధారపడిన అతీత శక్తులతో తనకుగల సంబంధ బాంధవ్యాలను సమగ్రంగా నిర్వచించుకోడానికి సాధనమే మతమని గాబ్లెట్

డి అల్వోల్లా నిర్వచనం. విశ్వాత్మకు మానవాత్మకు గల సంబంధాన్ని ఆధారంగా చేసుకొని మానవ జీవితాన్ని నిర్వచించడమే మతమని ఎ. రివెల్లి వ్యాఖ్యానించాడు.

ఇందుచేతనే మతం యొక్క నిర్వచనం ఈనాటికీ ఆనాటికీ ఒకేవిధంగా ఉన్నది. తనకూ విశ్వాత్మకూ గల పరస్పర సంబంధమే మతమని నాటికీ నేటికీ మానవుడు భావిస్తున్నాడు. వివిధ కాలాలలో వివిధ జాతులలో విభిన్న రీతులలో ఈ భావం వ్యాఖ్యానింప బడినప్పటికీ ఈ నిర్వచనమే అనాదినుంచీ మానవ జీవిత నౌకలను చుక్కానివలె నడుపుకుని వస్తున్నది.

తను ఈశ్వరుడు అవతరించిన జాతిలో జన్మించానని, అందుచేత భగవంతుడు తన జాతికి బోధించిన బోధలను తాను జీవితంలో అనుసరించాలనీ ఈజాతీయుడు విశ్వసిస్తున్నాడు. అమరత్వానికి ప్రతినిధులైన దేవతలను సంతృప్తి పరచడమే జీవన ధర్మమని గ్రీస్ దేశీయుని విశ్వాసం.

బ్రహ్మ పదార్థంనుంచే తాను బాహిరిల్లానని, తిరిగి, బ్రహ్మపదార్థాన్ని తాను చేరుకోవలెననీ బ్రాహ్మణ మతస్థుడు విశ్వసిస్తున్నాడు. జన్మపరంపరలో తగుల్కొనడం దుఃఖ భూయిష్టమైనదని సర్వ దుఃఖాలకూ మూలకారణం వాంఛ కాబట్టి, వాంఛను త్యజించి, దుఃఖ ముక్తిపొంది, నిర్వాణ పథాన్ని అధిరోహించడమే జీవనాదర్శమని

బౌద్ధుడు భావిస్తున్నాడు. ఈ విధంగా ప్రతి మతమూ మానవునికీ, అనంత విశ్వజీవితానికీ గల పరస్పర సంబంధాన్ని ఏదో ఒకరీతిగా నిర్వచిస్తూ ఉన్నది. ఈ నిర్వచనాన్ని ఆధారంగా చేసుకుని మానవుడు తన జీవన గమనాన్ని సాగిస్తున్నాడు. మానవునికీ అనంత విశ్వానికీ గల సంబంధాన్ని నిర్వచించని మతమంటూ అసలు ఉండదు. ఒకవేళ అలాటి మతం ఉన్నా (విగ్రహారాధన, ఇత్యాది), అది మతం కానేరదు. ఇంతేకాదు. అధునాతన విజ్ఞానాన్ని పురస్కరింప చేసుకుని భగవంతునికీ మానవునికీ గల సంబంధాన్ని నిర్వచించక పోయినట్లయితే దాన్నికూడా మతమని మనం భావించకూడదు. మానవ జీవితాన్ని అనంత విశ్వజీవితంతో సమన్వయించని పక్షంలో అదీ మతంకాదు. మానవ ప్రవర్తనను నిరూపించలేని విశ్వాసం సైతం మతం కానేరదు.

నిజమైన మతం సహేతుకంగాను, విజ్ఞాన సమ్మతంగాను, మానవ జీవితానికీ అనంత విశ్వజీవితానికీ గల సంబంధాన్ని నిర్వచిస్తుంది. విశ్వజీవితంతో మానవ జీవితాన్ని సమన్వయించి మానవుని ప్రవర్తనను నిర్దేశిస్తుంది.

## 4

**మ**తం వినా మానవులు జీవించిన యుగంకాని దేశంకాని ఎక్కడా ఎప్పుడూ లేకపోయినా, మతం వినా మానవుడు మనగలడని ఈనాడు మేధావులు చెబుతున్నారు.

మోలియర్ నాటకంలో ఒక వైద్యుడు ప్లీహం ఎడమప్రక్క ఉన్నదని మొండివాదన చేసినట్లుగా ఉంది, ఈ మేధావుల అభిప్రాయం. కాని మతం మటుకు అనాదినుంచీ అమరంగా ఉన్నట్టే ఈనాడుకూడా అమరంగా ఉన్నది, మానవులనూ మానవ సమాజాన్ని నడుపుతున్నది. మతాలు అనేకం ఉండవచ్చు. వివిధదేశాలలో వివిధ జాతులలో విభిన్న మతాలు ఉండవచ్చు. వివిధ దశలలో మానవులు తమకూ భగవంతునికీ గల సంబంధాన్ని వివిధరీతులలో నిర్వచించుకుని ఉండవచ్చు. కాని, మతం వినా మానవులు జీవించిన దశమటుకు చరిత్రలో ఎన్నడూ కనుపించదు.

మతాలకు అపార్థాలు కల్పించబడి మతాలకు, మానవ జీవితాన్ని నడిపేశక్తి సన్నగిలిన దశలుకూడా మనకు చరిత్రలో కనుపించవచ్చు. కాని ఈ దశలు తాత్కాలికంగా వచ్చిన దశలే కాని శాశ్వతంగా ఉన్నవికాదు. ప్రపంచంలో ప్రతి జీవపదార్థమూ పుట్టి, పెరిగి, వృద్ధిచెంది, క్షీణించి, మరణించి, తిరిగి తన స్వరూపంలో ఉత్పన్నమయినట్లే మతంకూడా ఈ పరిణామాలన్నిటినీ చెందడం సహజం. ఒక మతం ఒక ఉచ్చదశ పొందినప్పుడు, దాని వెంటనే ఒక క్షీణ దశ రావడంకూడా సహజం. కాని ఆ నిర్జీవ దశ గడిచిన తరువాత మతం తిరిగి పునర్జన్మ పొందుతుంది. పూర్వం కన్న విస్పష్టరూపంలో తరిస్తుంది. ప్రపంచంలోని మతాలన్ని

ఈ పరిణామాలకు గురిఅయినవే. బ్రాహ్మణమతం ఇలాంటి క్షీణదశనుపొందినప్పుడు, ఈ విధంగానే జరిగింది. ఉదాత్తమైన బౌద్ధధర్మం అవతరించి మానవ దర్శనాన్ని మరింత ముందుకు తీసుకుపోయింది. గ్రీక్, రోమన్ మతాలు ఇలా అధఃపతితాలైనప్పుడే క్రైస్తవమతం అవతరించింది. చర్చి క్రైస్తవమతం విగ్రహారాధనలలోకి దేవతా పూజల్లోకి దిగజారినప్పుడు కూడా ఇలాగే జరిగింది. పాలిషియన్లనే ప్రత్యేక క్రైస్తవ శాఖ ఏర్పడి చర్చి క్రైస్తవమతాన్ని విమర్శించింది. ఏకేశ్వరోపాసన మూలంగా గల మహమ్మదీయమతం ఉత్పన్న మైనది. మధ్య యుగాలనాటి క్రైస్తవమతం క్షీణించినప్పుడు సంస్కరణోద్యమానికి దారి తీయడం జరిగింది. మతాలూ, మతబోధలూ సన్నగిలిన ప్రతిదశలోనూ ఈ విధంగానే జరుగుతూ వచ్చింది. ప్రతి మతమూ ఇలాగే తాత్కాలికంగా క్షీణదశకు వచ్చినా తిరిగి నూతన రూపంలో ఉత్పన్నం కావడానికి కారణం, ప్రతి మతానికీ పరమార్థం మానవునికీ భగవంతునికీ గల సంబంధాన్ని నిర్వచించక పోవడమే. మతాలు వేరయినా మతాల పరమార్థం మాత్రం ఇదే. అనంత విశ్వంతో పోల్చి చూచినప్పుడు మానవుడు అణుమాత్రుడని ప్రతి మతమూ విశ్వసిస్తుంది. అందుచేత ఈశ్వరదృష్టిలో మానవులంతా సమానులేనను భావాన్ని ప్రతి మతమూ అంగీకరిస్తుంది. ఆ భగవంతుని

రూపం ఏదైనా కావచ్చు. ఆ భగవంతుడు ఒక మెరుపు కావచ్చు, ఒక గాలి కావచ్చు, చెట్టుకావచ్చు, పుట్టకావచ్చు, రోమ్‌లో భావించినరీతిగా రాజే కావచ్చు. కాని భగవంతుని మూలం మటుకు ఒకటే. మానవ సమానత్వాన్ని మటుకు అన్ని మతాలూ అంగీకరిస్తాయి. కాని వాస్తవ జీవితంలో మానవులంతా సమానులుగా పరిగణించడ మనేది ఎక్కడా జరగటంలేదు. కాబట్టి, ఒక నూతనమతం ఉత్పన్నంకాగానే-అసమానతవల్ల, స్వార్ధ ప్రయోజనాలను సాధించుకునే కొందరు, నూతన మతానికి అపార్థాలు కల్పించి అసలు సత్యాన్ని మరుగుపరచడం జరుగుతూ వచ్చింది. నూతన మతం ఉత్పన్నమైన ప్రతిదశలోనూ ఇలా జరిగేది. ఆ నాటి పరిపాలకులూ శ్రీమంతులూ, తమ పదవులకు భంగం కలగ కుండా ఉండడంకోసం అసమానత మతానికి విరుద్ధం కాదని, అసమానతను మతం అంగీకరిస్తుందనీ వ్యాఖ్యానాలు చేస్తూ వచ్చారు. అందుచేతనే ఉన్నత వర్గాలవారికి అణిగి మణిగి ఉండటంకూడా మతంలో ఒక భాగమని సామాన్య ప్రజలు భావిస్తూ వచ్చారు.

## 5

మానవుని కార్య కలాపా లన్నిటికీ మూడు ముఖ్య కారణాలున్నాయి. ఒకటి సంవేదన, రెండవది వివేచన,

మూడవది ప్రేరేపణ. ఈ మూడవదాన్ని 'లైమ్మలు' మంత్ర శక్తిగా కూడా భావిస్తాడు. ఒక్కొకసారి మానవుడు కేవలం సంవేదనకు అనుగుణంగా ప్రవర్తిస్తాడు. ఒక్కొకసారి కేవలం హేతువును ఆధారం చేసుకుని ప్రవర్తిస్తాడు. హేతువు ఏది కార్యము ఏది అకార్యము అనే విషయాన్ని విశదీకరిస్తుంది. ఒక్కొకసారి మానవుడు తన వ్యక్తిగత ప్రేరేపణవల్లకాని లేక ఇతరుల ప్రేరేపణవల్లకాని ప్రవర్తిస్తాడు. తనకు తెలియకుండానే ఈ ప్రేరేపణకు లొంగి పోతాడు. సాధారణ పరిస్థితులలో ఈ మూడు శక్తులూ కూడా మిళితమై మానవుని ప్రవర్తనను నిర్ణయిస్తాయి. సంవేదన మానవుని కార్యాచరణకు అభిముఖుణ్ణి చేస్తుంది. ప్రస్తుత పరిస్థితులను, గతానుభవాన్ని, భావి ఫలితాలను దృష్టిలో ఉంచుకుని ఈ కార్యంయొక్క ఉచితా నుచితాలను హేతువు నిర్ణయిస్తుంది. ప్రేరేపణ మానవుణ్ణి కార్యవాదినిగా చేసే ఆచరణకు ప్రోత్సహిస్తుంది. సంవేదనే కనక లేనట్లయితే మానవుడు కార్యాచరణకు అభిముఖుడు కావడమనేది జరగనే జరగదు. వివేచన లేకపోయినట్లయితే మానవుడు అనేక పరస్పర విరుద్ధాలైన భావాలకు లొంగిపోవలసి వస్తుంది. ప్రేరేపణ లేనట్లయితే మానవుడు కార్యాన్ని దీక్షతో కొన సాగించలేడు. అందుచేత మానవుని కార్యాచరణకు ఈ ప్రభావాలు మూడున్నూ అత్యవసరం. మానవుడు ఒక ప్రదేశం నుంచి మరో ప్రదేశానికి ప్రయాణం చేశాడంటే, అందుకు

కారణం సంవేదన. సంవేదన స్పందించడం వల్లనే అలా ప్రయాణం చెయ్యాలనే వాంఛ మానవునిలో కలిగింది. ఏ బాటలో నడిస్తే ఈ ప్రయాణం సుగమంగా సాగుతుందా అనే విషయాన్ని వివేచన నిర్ణయిస్తుంది. ఆ ఆదేశాన్ని అనుసరించి మానవుడు ఆ బాటలో అడుగు పెడతాడు. బాటలో నడుస్తూ ఉన్నప్పుడు ఈ రెండు ప్రభావాలనుంచీ విడిపడి కేవలం ప్రేరేపణనే అనుసరించి తన ప్రయాణాన్ని సాగిస్తాడు. మానవుని ప్రతి కార్యాచరణలోనూ ఈమూడింటి ప్రభావం కనుపిస్తుంది. ముఖ్యంగా మత విషయంలో మరింతగా ఉంటుంది.

మానవునికీ ఈశ్వరునికీ మధ్య సంబంధాన్ని నెలకొల్ప వలసిన అవసరాన్ని సంవేదన ప్రోత్సహిస్తుంది. వివేచన ఈ సంబంధాన్ని నిర్వచించి విశదీకరిస్తుంది. ఈ సంబంధం తాలూకు కార్యాచరణకు ప్రేరేపణ మానవుణ్ణి ప్రోత్సహిస్తుంది. మతానికి అపార్థాలు కల్పించబడక మతం స్వచ్ఛంగా ఉన్నంతవరకు మాత్రమే ఈ ప్రభావాలు సక్రమంగా పని చేస్తాయి. మతంయొక్క స్వచ్ఛత కలుషితం కావడం ప్రారంభించగానే ప్రేరేపణయొక్క ప్రభావం మరింత హెచ్చి సంవేదన, వివేచన - రెండిటియొక్క ప్రభావం క్షీణించడం ప్రారంభిస్తుంది. ప్రేరేపణ ప్రభావాన్ని ప్రదర్శించే విధానాలు ఎక్కడైనా ఎప్పుడైనా ఒకటే. పసితనంలో, మరణం,

జననం, వివాహం మొదలైన ప్రధాన సంఘటనలలోను ప్రవేశించి తన ప్రభావాన్ని మానవునిపై ప్రసరింపచేస్తుంది. అంతేకాదు. శిల్పం, సంగీత సాహిత్యాలు మొదలైన లలిత కళలద్వారా ఈ ప్రభావం ప్రసారిత మవుతుంది. ఈ లలిత కళలను అనుభవిస్తున్న దశలో మానవుడు ఒక విధమైన మానసాతీత స్థితిలో ఉంటాడు. పురాతన మతా లన్నిటి లోనూ ఈ విధానం, ఈ ప్రభావం మనకు కనుపిస్తుంది. ఉదాత్తమైన బ్రాహ్మణమతం దేవాలయాల్లో విగ్రహార్చనల లోకి, భజనకీర్తనలలోకి దిగజారింది. ప్రవక్తలు బోధచేసిన హీబ్రూమతంకూడా దేవతారాధనలలోకి, భజనల్లోకీ దిగజా రింది. బౌద్ధం దిగజారిన తరువాతనే బౌద్ధారామాలు వెలిశాయి. టాయిజం మొదలైన వితండశాఖలు ఏర్పడ్డాయి.

మతాలు కలుషితం కావడం ప్రారంభించిన తరువాత ఆ మతాల తాలూకు సంరక్షకులు తమ విశ్వాసాలనే ప్రజలపై రుద్దారు. వివేచనా జ్ఞానం క్షీణించిన ప్రజలను తమ ఇష్టం వచ్చినట్లు ఆడించారు. ప్రతి మతంయొక్క క్షీణ దశలోనూ మనకు ఈ విధమైన పరిణామం కనుపిస్తుంది. భగవంతునికీ మానవునికీ మధ్య ప్రత్యేకంగా కొందరు మధ్యవర్తు లుంటారని, మంత్రతంత్రాలు అవసరమనీ వీరు బోధించారు. ఇంతేకాదు. కొన్ని గ్రంథాలలో భగవంతుణ్ణి గురించి కొన్ని వాక్యాలు రచింపబడి ఉన్నవని, ఈ వాక్యా

లలో చెప్పబడిన సత్యం మార్పుచెందనిదీ, నిర్దుష్టమైనదీ అని వీరు చెప్పారు. వివేచనాశక్తి క్షీణించిన మానవులు ఈ విషయాలను అంగీకరించారు. భగవంతునికీ మానవునికీ మధ్యవర్తు లున్నారనే విషయాన్ని అంగీకరించడంతో ప్రతివితండ వాదాన్ని అంగీకరించవలసి వచ్చింది. మతం కలుషితమైంది. సర్వ మానవ సమానతా ధర్మం మరుగున పడిపోయింది. అసమానత్వానికి అగ్రస్థానం లభించింది. వర్ణ వ్యవస్థ, కుల శాఖా భేదాలూ ఏర్పడ్డాయి. మహాత్ములని, పాపాత్ములని భేదాలు పొడచూపాయి. క్రైస్తవ మతానికికూడా ఈవిపత్తే సంభవించింది. మానవులలో అసమానత్వాన్ని కడకు క్రైస్తవమతం కూడా అంగీకరించింది. బుద్ధిజ్ఞాన పరిపక్వతను బట్టి మాత్రమేకాక, సాంఘికస్థాయినిబట్టికూడా అసమానత్వం అంగీకరించబడింది.

## 6

మతాధికారులకూ సామాన్య మానవులకూ తేడా మాత్రమేకాక; అధికారులకు, శ్రీమంతులకు, బానిసలకుకూడా తేడాను అంగీకరించింది, క్రైస్తవమతం. కాని సత్యసందేశం లోని క్రీస్తు బోధలను మనం పరిశీలిస్తే ఈ అసమానత్వం క్రైస్తవ బోధలకు పూర్తిగా విరుద్ధమనే విషయం మనకు స్పష్టమవుతుంది. ఈ విధమైన వితండ సిద్ధాంతాలు క్రైస్తవ

మతంలో జొరబడకుండా సత్యసందేశంలో హెచ్చరిస్తూ ఉన్న కొన్ని వాక్యాలుకూడా మనకు కనుపిస్తాయి.

మతగురువులను గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు, ఒకరికొకరు ఎన్నడూ గురువులు కానేరరని సత్యసందేశం చెబుతూఉన్నది. పురాణగ్రంథాల నిర్దుష్టతను గురించి విచారిద్దామనుకుంటే, అంతరాత్మ ప్రధానమైనదికాని, అక్షర సమామ్నాయమైన వాక్యం ప్రధానం కాదని సత్యసందేశం చెబుతున్నది. జీసస్ మంత్ర తంత్రాల ద్వారా మాహాత్మ్యాలు ప్రదర్శించినట్టు సత్యసందేశంలోనే ఉదహరించబడి ఉన్నదికదా! మాహాత్మ్యాలు అసత్యాలని అనుకోడం ఎలాగా అని మీరు అడగవచ్చు. కాని జీసస్ తన సిద్ధాంతంయొక్క సత్యాసత్యాలను తన బోధలనే ఆధారంగా చేసుకుని విశ్వసించవలసిందని స్పష్టీకరించాడుకాని తన మాహాత్మ్యాలను ఆధారంగా చేసుకుని విశ్వసించమని చెప్పలేదు. అంతేకాదు. క్రైస్తవమతం మానవ సమానత్వాన్ని వేళ్ళు ఉద్ఘాటించే మతం. భగవంతునికి బిడ్డలైన మానవులంతా సహోదరులనే సిద్ధాంతం క్రైస్తవ మతానికి పునాది. ఇలాటి మతంకూడా తనసిద్ధాంతాలను తానే తిరస్కరించడం జరిగింది.

సత్యసందేశాన్ని చదివినవారికి క్రైస్తవ మతానికి అపార్థాలు కల్పించడమనేది కేవలం అసాధ్యమైన విషయంగా

కనిపించవచ్చు. కాని మానవుని మేధస్సు సూక్ష్మమైనది. సత్యసందేశంలో చెప్పబడిన విషయాలను తారుమారు చెయ్యడానికి మార్గాలను అన్వేషించింది మానవ మేధస్సు. సత్యసందేశంలో చెప్పబడిన విషయాలు నిరుష్టాలని, ఆ విషయాలను ప్రశ్నించరాదనీ శాసనం చెయ్యడమేకాక చర్చి పెద్దలకు సర్వాధికారాలు యివ్వబడ్డాయి.

ఇక సత్యసందేశంలోకూడా కొన్ని కొత్తఅంశాలు చేర్చబడ్డాయి. జీసస్ అవతారాన్ని చాలించే సమయంలో దివ్యజ్ఞానాన్ని బోధించే అధికారం కొందరికే ప్రసాదించాడనీ, వారికి సర్ప పిశాచాది భయాలు ఎంతమాత్రం అంటవని జీసస్ చెప్పాడని, మంచిచెడ్డలు నిర్ణయించే అధికారంకూడా వారిదేననీ ఒక కొత్తఅంశం ఏర్పడింది. ఈనూతన అంశాన్ని సత్యసందేశంలో 'చేర్చడంతో చర్చి పరమ పవిత్రమైన సంస్థ కాబట్టి చర్చి అధికారాన్ని ప్రశ్నించే అధికారం ఎవ్వరికీ లేకుండాపోయింది. సత్యసందేశం సైతం హేతువాదానికి అతీతమైనదని, సత్యసందేశాన్ని వ్యాఖ్యానించగల అర్హత, అధికారం ఒక్క చర్చి అధికారులకు మాత్రమే ఉన్నదని భావించబడింది.

ఈ విధంగా మతాన్ని కలుషితం చెయ్యగల మూడు విధానాలూ క్రైస్తవమతం విషయంలో అనుసరించబడ్డాయి. మతగురువుల ఆధిక్యత అంగీకరించబడింది. మంత్రతంత్రాలు,

మహాత్మ్యాలూ అంగీకరించబడ్డాయి. సత్యసందేశం నిర్దుష్ట మనే విషయంకూడా అంగీకరించబడింది. భగవంతునికీ మానవునికీ మధ్య మధ్యవర్తులుంటారని, మహాత్మ్యాలు జరగడం సంశయించరాదని, సత్యసందేశంలో అనుమానించ దగిన లక్షణం ఒక్కటికూడా లేదనీ అంగీకరించబడింది.

క్రైస్తవమతం కూడా ఇతర మతాలన్నిటి వలెనే కలుషితం కావించబడింది. క్రైస్తవ మతానికి మూల సిద్ధాంతం మానవ సమానత్వం కాబట్టి ఈమూలసిద్ధాంతాన్ని మరుగుపరచడానికి గాఢమైన యత్నాలు జరిగాయి. చర్చి ఇందుకు ఎంతో తోడ్పడింది. నిజానికి, చర్చి సాయంతో క్రైస్తవమతం పేరిట బోధింపబడినంత అవినీతి మరేమతం పేరిటా బోధింపబడలేదు. సత్యసందేశం పూర్వభాగాల్లోనే అసందర్భాలు కొల్లలు కొల్లలుగా అగుపిస్తాయి. సూర్యుడు సృష్టింపబడడానికి ముందే వెలుగున్నదట. 6000 సంవత్సరాల క్రితం ఈ ప్రపంచం సృష్టించబడిందట. జలప్రళయం వచ్చినప్పుడు జంతుజాలమంతా ఆర్క్ అనే పడవలో శరణ్యం పొందిందట. పసిబిడ్డలను ఊచకోత కోయవలసిందని భగవంతుడు శాసించాడట. ఈ అసందర్భ విషయాలమాట అలాఉంచి ఉత్తరభాగంలో కనుపించే అసందర్భాలు వీటికన్న విపరీతంగా కనుపిస్తాయి. క్రైస్తవ మత ప్రధాన అర్చన క్రమాలలో భక్తులు తాము ఆరాధించే భగవంతుని రక్త

మాంసాలను చిహ్న ప్రాయంగా భక్షించే అర్చన ఒకటి. ఇంతకన్న వైపరీత్యం మరేమన్నా ఉన్నదా? భగవంతుని తల్లి కన్య కావడం ఎలా సాధ్యం? ఆకాశం బ్రద్దలై అచటి నుండి ఒక కంఠస్వరం వినిపించిందట. జీసస్ ఆకాశంలోకి ఎగిరిపోయాడట. తన తండ్రికి కుడిప్రక్కన ఆసీను డవుతాడట. త్రిత్వంలో ఏకత్వము, ఏకత్వంలో త్రిత్వమూ ఉన్నదట. ఈ అసంబద్ధ విషయాలను మనం ఎలా సమన్వయించు కోవడం? ఇంతేకాదు. ఆదం చేసిన పాపానికి మానవజాతి యావత్తునూ కోపోద్దీపితుడైన ఈశ్వరుడు శిక్షిస్తాడని, ఇలా శిక్షించబడిన మానవులను రక్షించడానికి తన కుమారుడిని ఇలాతలానికి పంపాడని, మనుష్యులు తన కుమారుని చంపగలరని ముందుగా తెలిసికూడా ఆ కుమారుని అవత రింప చేశాడని, బాప్తిజాన్ని పుచ్చుకోవడంవల్లనే పాప విముక్తి లభించగలదని, భగవంతుని కుమారునిలో నమ్మకం లేనివారు శాశ్వత నరకాగ్నులలో వేగిపోగలరని నమ్మడం కన్న నీతి విరుద్ధమైన విషయం మరేమున్నది?

ఇంతేకాదు. వివిధ విగ్రహారాధనలు, పూజా పున స్కారాలు, ప్రార్థనలూ, భజన సంకీర్తనలూ కూడా వెలిశాయి. జీసస్ మేరీమాత విగ్రహాలకు మొక్కుకోవడం ఆవిడ మహా త్మ్యాలు చేయగలదని భావించడం కూడా ప్రారంభించారు. వివేచనా జ్ఞానం కించిత్తయినా కలిగినమానవుడు విశ్వసించ

జానికి ఏ మాత్రం సాక్ష్యంకాని విషయాలూ విశ్వాసాలు క్రైస్తవమతానికి అంటగట్టబడినవి.

మనుష్యులు తమ పెదవులను కదిలిస్తూ ఏ మంత్రాన్నయినా జపించవచ్చు. కాని అర్థరహితమైన విషయాలను విశ్వసించడం ఎలా? నిజం చెప్పాలంటే మన అధునాతన యుగంలో ఏ ఒక్క వ్యక్తికీ క్రైస్తవ మతంలో విశ్వాసం ఉన్నదని భావించలేము. ఇదే మనం జీవిస్తూఉన్న ఈకాలం యొక్క ప్రత్యేక లక్షణం.

# 7

ఈ రోజులలో ప్రజలకు ఏ మతంలోనూ విశ్వాసం లేదు. అయినప్పటికీ హీబ్రూలకు పాల్ చెప్పాడని భావించబడుతున్న సత్యసందేశాన్ని ఆధారంగా చేసుకుని తమకు ఒక విశ్వాసం అన్నది ఉన్నట్లుగా భావిస్తున్నారు. ఈ సందేశంలో విశ్వాసం అన్నది ఈ విధంగా నిర్వచించబడింది: 'మానవులు ఆసించే విషయాల సారాంశమే విశ్వాసం. అదృశ్య శక్తులకు సాక్ష్యమే విశ్వాసం'. కాని ఈ నిర్వచనం పూర్తిగా హేతు విరుద్ధంగా కనుపిస్తున్నది. విశ్వాసం అనేది ఒక విషయంకాదు. అది మానసిక అవస్థ. విశ్వాసానికి ఒక భౌతిక స్వరూపమంటూ ఉండదు. ఇక విశ్వాసం అన్నది అదృశ్య విషయాలను గురించిన సాక్ష్యం అనుకుందామన్నా

అంటే అదృశ్య విషయాలకు భౌతిక సాక్ష్యం ఇవ్వాజమనేది అసంభవమైన విషయం. అందుచేత విశ్వాసం ఈ రెంటికీకీ సంబంధించిన విషయం కాదు. విశ్వాసం అంతరంగానికి సంబంధించిన ఒక అవస్థ. మానవుడు ఇహలోకంలో కొన్ని కర్మలను నిర్వర్తిస్తాడు. ఆ కర్మల తాలూకు జ్ఞాన చైతన్యమే విశ్వాసం. మానవుడు ఈ లోకంలో కార్యాచరణ కావించేటప్పుడు తన విశ్వాసాన్ని అనుసరిస్తాడు. కాని ఈ విశ్వాసం అదృశ్య శక్తుల సాక్ష్యంవల్లకాని, ఆశలవల్లకాని ఏర్పడింది కాదు. మానవుడు ప్రపంచంలో తనకుతానే నిర్వచించుకున్న తన స్థానాన్నిబట్టి ఏర్పడింది. దీనికి అనుగుణంగానే మానవుని కార్యాచరణ ఆధారపడి ఉంటుంది.

ఒక సేద్యగాడు భూమి సేద్యంచేస్తున్నాడన్నా, ఒక నావికుడు సముద్రంలో నౌకాయానానికి బయలుదేరాడన్నా అందుకు కారణం వారు ఆ పనులకు ఫలితాలనూ బహుమతులనూ ఆశించడంకాదు. అది వారిస్వభావం కనుక వారు ఆ పనులను చేస్తున్నారు. ఈ విధంగానే మతంలో విశ్వాసం కల వ్యక్తికూడా మతానికి అనుగుణంగా తన జీవితాన్ని తీర్చిదిద్దుకుంటాడు. అందువల్ల తనకు బహుమతులూ ఫలితాలూ వస్తాయని కాదు. అతను అలా సంచరించుకోడం అతనికి సహజధర్మం. ఒక మానవుడు సంఘంలో తన స్థానాన్ని ఒక కార్మికుడనో ఒక పనివాడనో లేక ఒక అధికారిఅనో నిర్వ

చించుకున్నప్పుడు అమానవుడు తదనుగుణంగా ప్రవర్తించడం అతని సహజ ధర్మం. ఈవిధంగానే భగవంతుడు ప్రత్యేకంగా అవతరించడంకోసం ఎన్నుకున్న జాతిలో తాను సభ్యుడనని తన స్థానాన్ని నిర్వచించుకున్నప్పుడు ఆ భగవంతుని ఆదేశాలకు అనుగుణంగా జీవించడానికి యత్నిస్తాడు. అనేక స్వరూపాలలో తన ఉనికి పరిణామం చెందుతూ వచ్చిందని భావించేవ్యక్తి ఈ నిర్వచనానికి అనుగుణంగానే తన జీవయాత్ర సాగిస్తాడు. కొన్ని అణువులయొక్క యాదృచ్ఛిక సమ్మేళనంవల్ల తాత్కాలికంగా చైతన్యం సముద్దీప్తమై తన జీవితం ఏర్పడిందని భావించేవ్యక్తి ఈ నిర్వచనానికి అనుగుణంగా జీవయాత్ర సాగిస్తాడు.

ఈ ముగ్గురి వ్యక్తుల జీవనపద్ధతులూ మూడు ప్రత్యేక విధాలుగా ఉంటాయి. దానికి కారణం వీరు మూడు ప్రత్యేక విధాలుగా తమ జీవితాలను నిర్వచించుకోవడమే. అనగా ఈ ముగ్గురు వ్యక్తులకూ మూడు తరహాలైన విశ్వాసాలున్నవన్న మాట. విశ్వాసానికీ మతానికీ ఎక్కువ భేదంలేదు. రెండూ ఇంచు మించుగా ఒకటే. రెంటికీ ఒకే ఒక చిన్న వ్యత్యాసం ఉన్నది. మతం అనే పదాన్ని మనం ఉపయోగించినప్పుడు ఆ భావనలో మనకు వెలుపల జరిగే విషయాలుకూడా కొన్ని ఇమిడిఉంటాయి. కాని విశ్వాసం అన్నది కేవలంగా ఆంతరంగిక అనుభూతి. మానవునికీ అనంతవిశ్వాసానికీగల సంబంధాన్ని

గురించి మానవుని ఎరుకే విశ్వాసం. ఈ విశ్వాసంపైనే మానవుడు చేసే ప్రతిపనీ ఆధారపడిఉంటుంది. అందుచేత నిజమైన విశ్వాసం నిష్ప్రయోజనం ఎన్నటికీ కానేరదు. తత్త్వాల హేతు పూర్వక విజ్ఞానానికి విరుద్ధంగా ఎన్నటికీ ఉండదు. అర్థ రహితంగాను, లోకాతీతంగాను ఉన్నది విశ్వాసం ఎన్నటికీ కానేరదు. అంతేకాక సరియైన విశ్వాసంయొక్క స్వరూపాన్ని ఇదమిద్ధమని ఋజువుపరచలేక పోయినప్పటికీ మానవ విజ్ఞానానికికానీ హేతువాదానికికానీ విరుద్ధమైన విషయం ఈ విశ్వాసంలో కనుపించదు. ఉదాహరణకు:- అఖిలలోకేశ్వరుడైన సృష్టికర్తలో విశ్వాసం ఉన్న ఒక హీబ్రూ విశ్వాసం హేతు విరుద్ధమని అనలేము. అఖిల లోకేశ్వరుడైన సృష్టి కర్త ఒకడున్నాడని; ఆ సృష్టికర్త ప్రపంచాన్ని, జంతు జాలాన్ని, మానవుణ్ణీ సృష్టించాడని తన ఆదేశాన్ని అనుస రించిన వారిని తాను స్వయంగా సంరక్షిస్తానని హామీ ఇచ్చాడనీ హీబ్రూ విశ్వసిస్తాడు. ఈ విశ్వాసం అతని విజ్ఞా నానికి అనుగుణమైనదే. అంతేకాదు. ఈ విశ్వాసంవల్లనే అతను ఇతరవిధాలుగా తను అవగాహన చేసుకొనలేని ఎన్నో విషయాలను తెలుసుకొన గలిగాడు.

ఈవిధంగానే జీవుడు చేసుకొన్న కర్మ పరిపాకంకొద్దీ వివిధ జన్మలు ప్రాప్తిస్తాయని విశ్వసించే హిందువుకూడా తన విశ్వాసం ద్వారానే అనేక క్లిష్ట విషయాలను బోధపరుచు కున్నాడు.

వాంఛా నిర్మూలనంద్వారా శాంతిని పొందవచ్చునసే బౌద్ధుని విశ్వాసంకూడా ఇటువంటిదే. ఆ విశ్వాసమే అతనికి అనేక నిగూఢ విషయాలను సుబోధకం చేసింది.

ఈశ్వరుడు మానవులందరికీ తండ్రివంటివాడని, తను ఈశ్వరునికి కుమారుడననీ మానవులందరూ సోదర సమాను లనీ విశ్వసించే క్రైస్తవుని విశ్వాసంకూడా పైవిధ మైనదే.

ఈ విశ్వాసాలన్నీ మానవన్నైజంగా సమంజసమైనవే. హేతువిరుద్ధమైనవికావు. పైగా జీవితంలో జరిగే అనేక సంఘ టనలను ఈ విశ్వాసాలు సమన్వయ పరుస్తాయి. ఈ విశ్వాసాలే కనక లేనిపక్షంలో ఈసంఘటనలు సమన్వయరహితంగాకూడా కనుపిస్తాయి. అంతేకాదు. ఈ విశ్వాసాల సృష్టిలో మాన వుని స్థానాన్ని నిర్వచించి ఆ స్థానాన్ని అనుసరించి అతని ప్రవర్తనయొక్క పథాన్నికూడా నిర్దేశిస్తాయి. అందువల్ల ఒక మతం మానవ జీవితాన్ని అపసవ్యంగా వ్యాఖ్యానించి సరి యైన అర్థాన్ని మరుగుపరిచిందీ అంటే ఆ మతం మతం కాక పోగా ఒక వితండవాదం మాత్రమే అవుతుంది. నిజమైన విశ్వాసానికీ అపసవ్యమైన విశ్వాసానికీ ఒకే ఒక తేడాఉన్నది. విశ్వాసం అపసవ్యమైన దైనప్పుడు మనిషి భగవంతుణ్ణి కొన్ని కోరికలను తీర్చుకోడంకోసం ఉపాసిస్తాడు. తన పూజా పున స్కారాలకు మెచ్చుకుని భగవంతుడు కొన్ని వరాలను ప్రసా

దిస్తాడని ఆశిస్తాడు. కాని సత్యమైన విశ్వాసంగల భక్తుడు భగవంతుణ్ణి నిష్కామంగా అర్చిస్తాడు.

ఈ నిష్కామమైన భగవద్విశ్వాసమే ఈ రోజుల్లో మరుగున పడిపోయింది. ఈ నిష్కామభక్తి స్వరూపం ఎవరికీ తెలీదు. చివరకు మిగిలినది మంత్ర తంత్రాలు, జపాలు, ఆరాధనలూనూ!

## 8

నిజం ఆలోచిస్తే ఈరోజుల్లో ప్రపంచంలో మతం అన్నదే లేదని చెప్పవచ్చు. శ్రీమంతులూ, చదువుకున్న వారూ కొద్దిమంది ఉన్నారంటే వారికి ఏ మతంలోనూ విశ్వాసంలేదు. వారి దృష్టిలో మతాలన్నీ అర్థరహితాలుగా కనుపిస్తాయి. లేదా ప్రజలను దాస్యంలో అట్టిపెట్టడానికి ఉపయోగపడే సాధనాలుగా కనుపిస్తాయి. ఇహ, చదువూ సంస్కారంలేని సామాన్య ప్రజలున్నారంటే, వారింకా చర్చి మతంలోనే నమ్ముతున్నారు. వారికి చర్చి అసలు నిజమైన మతాన్ని బోధించకుండా వారిని అజ్ఞానాంధకారంలోనే ఉంచుతున్నది.

ఈ పరిస్థితుల ప్రభావమే ఈనాడు మన క్రైస్తవ ప్రపంచంపై పనిచేస్తున్నది. ఒక ఉన్నతవర్గం ప్రజా బాహుళ్యాన్ని, మాయపన్ని తన అదుపాజ్ఞలలో ఉంచుకుంటున్నది.

నిజం ఆలోచిస్తే ఈ పరిస్థితి ఎంతో భయంకరమైనది. పాలక వర్గాలవారి క్రౌర్యం, అణగారిపోయిన సామాన్యప్రజల అసహాయస్థ స్థితీ నిజంగా సహించరానిది. చరిత్రలో ఇంతటి క్షీణదశ మనకు ఎన్నడూ కనుపించదు. ముఖ్యంగా క్రైస్తవమత చరిత్రలో క్రైస్తవమతానికి ప్రధానలక్ష్యమైన మానవ సమానత్వం ఇంతగా మరుగుపడిపోయిన దశ మనకు చరిత్రలో ఇంతకుముందు ఎన్నడూ కనుపించదు.

ఈనాడు మనిషి మనిషిపట్ల ఇంత క్రూరంగా ప్రవర్తించడానికి ముఖ్యకారణం ఈనాటి నాగరికతే. ఈ జీవన వ్యవస్థే అలాంటిది. సున్నితమైన క్లిష్టతతో కూడిన ఈనాటి జీవన వ్యవస్థ మానవులుచేసే పనుల తాలూకుఫలితాలను, ఆ పనులు చేసిన మానవులకే తెలియకుండా మరుగుపరుస్తున్నది. అటలాన్, చెంగిజ్ ఖాన్ ఎంత క్రూరులైనా అయి ఉండవచ్చు — కాని వారు జరిపిన హత్యాకాండ ఫలితాలు— యుద్ధరంగ దృశ్యాలు — వారికి భీకరంగానే కనుపించి ఉంటాయి. కాని ఈనాడు జరుపబడే హత్యాకాండయొక్క స్వరూపమే వేరు. ఈనాడు జరుపబడే హత్యలు ఎంతో క్లిష్టంగా ఎంతో సున్నితంగా ఎంతో జాగ్రత్తతో జరుపబడుతున్నవి. హత్యల ఫలితాలు హత్య జరిపినవారికి తెలియకుండా ఎంతో జాగ్రత్తతో మరుగుపరచ బడుతున్నవి. ఈ పరస్పర హింసాకాండ నానాటికి తీవ్రతరమవుతూ ఉన్నది.

నీరో చక్రవర్తి రక్త స్నానం చేశాడని ప్రతీతి. ఆ విషయాన్ని అలా ఉంచండి. కాని ఈ రోజుల్లోనూ రక్త స్నానాలు జరపడానికి పైవర్గాలవారు జంకరు. కాని ఈ రక్త స్నానాలు మర్యాదగా జరపబడాలి, అంతే. రోగగ్రస్తులైనవారికి రక్తస్నానం చేయించాలని వైద్యుడొకడు సలహా యిచ్చినట్లయితే, అందుకు తగిన ఏర్పాట్లు చెయ్యడానికి ధనవంతుడు జంకడు. కాని ఆ ఏర్పాట్లను మర్యాదగా చేయిస్తాడు. అంటే రక్తం ఓడ్చమని ప్రజలను తాను స్వయంగా బలవంతపెట్టడు. వారంతట వారే రక్తం ఓడ్చే పరిస్థితులను కల్పిస్తాడు. ఖైదులను, వధ్య శిలలను మంత్ర తంత్రాలతో పునీతం కావించినట్లే ఈ రక్తగుండాలనుకూడా పునీతం కావించడానికి మతగురువులను నియమిస్తాడు. యుద్ధాలు, వేశ్యాగృహాలు శాస్త్ర సమ్మతాలని సిద్ధాంతీకరించినట్లుగానే ఈ రక్త గుండాలుకూడా శాస్త్ర సమ్మతాలేనని సిద్ధాంతీకరించడానికి శాస్త్రజ్ఞులనుకూడా నియోగిస్తాడు.

సర్వమతాలకు మూలసిద్ధాంతమైన సర్వమానవ సమానత్వం ఈనాడు పూర్తిగా మరుగున పడిపోయింది. మతం పేరిట బయలుదేరిన అనేక రకాలైన వితండవాదాలు ఈ సమానత్వాన్ని పూర్తిగా మరుగుపరిచాయి. ఇంతేకాదు, శాస్త్ర విజ్ఞానం మానవ అసమానత్వాన్ని బలపరుస్తూ సిద్ధాంతీకరిస్తూఉంది కూడా. జీవన సంఘర్షణలో బలవంతులు

మనగలరు, బలహీనులు మనలేరు అనే సిద్ధాంతాన్ని ప్రతి పాదించడం ద్వారా శాస్త్ర విజ్ఞానం మానవ అసమానత సహజమైనదేనని సమర్థిస్తున్నది. కొద్దిమందియొక్క క్షేమం కొరకు వేలాది ప్రజలను హతమార్చడం అతి సహజంగా భావించబడడమే కాకుండా ప్రతినిత్యం ఈ హత్యాకాండ కొనసాగించబడుతూ ఉన్నది.

పంథొమ్మిదవ శతాబ్దంలో -శాస్త్ర విజ్ఞానంయొక్క అభివృద్ధి అపూర్వమనీ అద్భుతమనీ అనేకులు వేనోళ్ళ పొగడడం మనం వింటున్నాం.

ఈ విషయం నిజమే. ఈ శతాబ్దంలో ప్రకృతి శక్తు లను జయించడంలో శాస్త్రవిజ్ఞానం అఖండమైన పురోగతి పొందిన దనడంలో ఎంతమాత్రం సందేహంలేదు.

కాని అవినీతికూడా ఇంతగా విజృంభించిన దశ చరిత్రలో మరెప్పుడూ కనుపించదు. మానవుని పశుప్రవృత్తి ఈ యుగంలో విజృంభించినట్లు మరే యుగంలోనూ విజృంభిం చలేదు. శాస్త్ర విజ్ఞానం అఖండంగా పురోగమించి నప్పటికి మానవత్వం మటుకు పూర్తిగా మంట కలిసిపోయింది. చెంగిజ్ ఖాన్ నీరోల కాలంలో కూడా ఇంతటి ఘోర కృత్యాలు జరగలేదు.

మరలు, రైళ్ళు, ముద్రణా యంత్రాలు, మొదలైన అనేక నూతన ప్రక్రియలు నెలకొల్పబడినమాట వాస్తవమే.

కాని ఇంతకన్నా విలువైనవి మానవుల ప్రాణాలు. మానవ జీవితంలోని అందాన్ని పూర్తిగా విరూపంచేసే ఈయంత్రాల నిర్మాణంకోరకు మానవుల ప్రాణాలు బలి గొనబడుచున్నవి. ఈ ప్రశ్నకు శాస్త్రజ్ఞులు సరియైన సమాధానం చెప్పరు. పైగా ఒక అర్థరహితమైన సమాధానాన్ని చెబుతారు.

యంత్రాలను నిర్మించడానికి అవసరమైన పరికరాలు కనిపెట్టబడినవనీ కాలక్రమేణా ఈ పరికరాలు అమలులోకి రాగలవనీ అంటారు. కాని ఇది పూర్తిగా అసత్యం. మానవు లంతా సోదరులేననీ సమానులేననీ విశ్వసించనంతకాలం, మానవ జీవితాన్ని పరమ పవిత్రంగా పరిగణించనంతకాలం, ఎట్టి పరిస్థితులలోను మానవ ప్రాణాన్ని బలి గొనరాదని గ్రహించ నంతకాలం, ఈ మహా నాశనం తప్పదు. మాన వులు స్వార్థ కాంక్షతో ఒకరి ప్రాణాలు మరొకరు బలిగొం టూనే ఉంటారు.

వంద పౌండ్ల ఖర్చుతో ఒక విషయాన్ని సాధించ కలిగినప్పుడు అందుకోసం వెయ్యి పౌండ్లు ఖర్చుచేసే వెర్రి వాడు ఎవడూ ఉండడు.

చికాగో రైలురోడ్డు ప్రతి ఏడాదీ కొందరి ప్రాణాలను బలిగొంటుంది. ఈ ప్రాణహాని జరగకుండా ఉండడానికి రైలురోడ్ల యజమానులు ఎట్టి యత్నాలూ చెయ్యరు. కారణం లేకపోలేదు. ప్రతి ఏడాదీ గాయపడినవారికి అయ్యే

మందు ఖర్చు, ఈ పరికరాలను నెలకొల్పే ఖర్చు వడ్డీకంటె కూడా తక్కువనే విషయం వారికి తెలుసు.

స్వార్థ లాభానికి ప్రజల ప్రాణాలను బలిగొనే వీరి చర్యలను ఆపుచెయ్యడానికి మార్గాలు లేకపోలేదు. బహిరంగంగా వీరిని విమర్శించడంద్వారాను ప్రజాభిప్రాయాన్ని సమీకరించడం ద్వారాను వీరిని చక్కదిద్దవచ్చు. కాని మానవులు మతాన్ని అనుసరించనంతకాలం, ఇలాటి సంస్కరణ జరగడానికి వీలుండదు. భగవంతునిసేవ దృష్టిలో ఉంచుకొనక మనుష్యుల మెప్పుకోసమే వారు సంచరిస్తున్నంత కాలం ఇలాటి సంస్కరణలు జరగవు. ఒకవేళ వారు కొన్ని పరికరాలను నెలకొల్పి కొందరి ప్రాణాలను కాపాడినా, ఇతర విధాలుగా ఈ పరస్పర హింస సాగుతూనే ఉంటుంది.

మానవ ప్రాణాలను హతమార్చడానికి సిద్ధమైన పక్షంలో, ప్రకృతిని జయించడం, రైళ్ళు, స్టీమర్లు, ప్రదర్శనశాలలు నిర్మించడం మొదలైనవి పెద్ద పనులుకాదు. ఈజిప్ట్‌లోని పిరమిడ్లను చూచి మనం ఎంతో గర్విస్తున్నాం. కాని ఈ పిరమిడ్లను నిర్మించడానికి ఎన్ని కోటానుకోట్ల ప్రాణాలు ఆహుతి అయినవో మనం గమనించడంలేదు. ఈవిధంగానే మన ప్రదర్శనశాలలను, అంతర్జాతీయ తంతి వార్తలను చూచుకుని మనం ఎంతో సంతోషిస్తున్నాం. కాని వీటి కోసం ఎన్ని ప్రాణాలు త్యాగం చెయ్యబడినవనే విషయాన్ని మనం ఆలోచించలేదు.

క్రైస్తవజాతులు, అమెరికాలో ఇండియన్లను, హిందువులను, ఆఫ్రికన్లను జయించి బానిసలుగా చేశాయి. ఇప్పుడు చైనా దేశీయులను జయించి బానిసలుగా చేస్తున్నవి. దీనికి కారణం క్రైస్తవ జాతులలో మతవిశ్వాసమూ ఆధ్యాత్మిక శక్తీ పూర్తిగా క్షీణించడమే. జయించబడిన జాతులకన్న కూడా ఆధ్యాత్మికశక్తి ఎక్కువగాకల క్రైస్తవ జాతులు ఇలా పతనం కావడం ఎంతో శోచనీయం. హిందువులనూ చైనీయులనూ అలా ఉంచి - ఆఖరుకు జులూ జాతీయులకు కూడా కొన్ని మత నియమా లున్నాయి. కాని మన క్రైస్తవ జాతులలో మత నియమాలు పూర్తిగా మృగ్యమై పోయాయి. రోమ్‌లో మతం పూర్తిగా క్షీణించి మత నియమాలు పూర్తిగా నశించనప్పుడే రోమ్ ప్రపంచాన్ని జయించింది. ఈనాడు క్రైస్తవ జాతులలో సరిగ్గా ఇదే జరుగుతున్నది. క్రైస్తవజాతులన్ని ఇప్పుడు ఒకే పరిస్థితిలో ఉన్నవి.

ఏ క్రైస్తవ జాతీ మత నియమాలను అనుసరించడం లేదు. అందుచేత క్రైస్తవ జాతులన్నీ కలిసి ఒక దొంగల గుంపుగా ఏర్పడ్డాయి. అంతరాత్మను, నీతి నియమాలను మానవత్వాన్ని పూర్తిగా విస్మరించి దొంగతనాలు దోపిడీలు హత్యాకాండలు నిరాఘాటంగా సాగిస్తున్నాయి. కొన్ని క్రైస్తవ జాతులవారికి అసలు ఎందులోనూ విశ్వాసంలేదు. మరికొందరు ఏదో విశ్వాసం ఉన్నట్లు కన్పిస్తూ తమ స్వార్థ

ప్రయోజనాలకోసం ఆ విశ్వాసాన్ని వినియోగించుకుంటూ ఉన్నారు.

ఇక ఈ ఆధునిక నియంతలకూ నీరోలాంటి పురాతన నియంతలకూ ఎలాంటి భేదమూ కనుపించదు. స్వరూపంలో తేడా. అంతే. తమ వైపరీత్యాలను, సుఖ లాలసత్వాలను సంతృప్తి పరుచుకోడంకోసం ప్రజలనూ ప్రజా క్షేమాన్నీ ఆహూతి చేస్తారు. ప్రజలను బానిసలుగా చేస్తారు. ప్రజలు బానిసలు కాగానే వీరి సుఖలాలసత కూడా అధికమవుతుంది. సుఖలాలసత అధికం గావడంతో బానిసలుకూడా అధికం కావలసిన అవసరం ఏర్పడుతుంది.

'సృష్టిక్రమం' గ్రంథంలో ఒక విషయం స్పష్టంగా వ్రాయబడి ఉన్నది. జల ప్రళయానికి ముందు జరిగిన సంఘటన ఇది. తనను సేవించడంకోసం మానవులకు తాను ప్రసాదించిన ఆత్మశక్తిని మానవులు తమ స్వార్థ వాంఛలను తీర్చుకోడం కోసం ఉపయోగించడం చూచి భగవంతునికి ఆగ్రహం కలిగిందట. అప్పుడు మానవులను సృష్టించినందుకు ఈశ్వరుడు పశ్చాత్తపించాడట. మానవులందరినీ ఒక్కుమ్మడిగా ధ్వంసంచేద్దామనుకున్నాడట. కాని ఇంతలో ఆయనలో అనుగ్రహావేశం ఉదయించి మానవులను పూర్తిగా ధ్వంసం చెయ్యడానికి ముందు మానవుల ఆయుఃపరిమాణాన్ని 120 సంవత్సరాలకు తగ్గించమని ఈశ్వరుడు నిర్ణయించాడట.

ఈ విషయమే ఈనాడు మన క్రైస్తవ ప్రపంచంలో తిరిగి జరుగుతూ ఉన్నది.

మానవుడు తనకూ ప్రపంచానికీ ఉన్న సంబంధాన్ని హేతువుద్వారా నిర్వచించుకుంటాడు. మానవు లందరికీ అనంత విశ్వంతో గల సంబంధం ఒకే విధమైనది కావడం వల్లనూ, మతం ఈ బంధాన్ని నిర్వచించేది కావడంవల్లనూ మతం మానవులందరినీ ఏకీకరిస్తుంది. ఈ ఐక్యతే మానవులకు ఇహ పరాలలోను క్షేమాన్ని కలగచేస్తుంది.

(సమగ్రమైన హేతువుతో పరిపూర్ణమైన ఐక్యత—సర్వ మానవ శ్రేయస్సు—ఇవే మానవజాతి పరమార్థాలు. ఈ అవధులను చేరడానికి మానవజాతి యాత్రచేస్తుంది.

మతాలన్నీ మానవులను ఐక్యపరచి ఈ శ్రేయస్సు వైపుకు నడుపుతాయి. కాని మానవుని వివేచనాజ్ఞానం సరియైన బాటతప్పి అపమార్గాలు పట్టినప్పుడు, పరస్పర హింసా కాండకు వినియోగించ బడినప్పుడు, మానవజాతికి విపత్తు సంభవిస్తుంది. సక్రమ జీవనం అసాధ్యంగా కనుపిస్తుంది.

ఎంతో అనాగరికమైన మతబోధలను అనుసరించిన క్రైస్తవేతరులుకూడా ఈనాటి మన క్రైస్తవ జాతులవారి కన్న సత్యానికి ఎక్కువ చేరువలో ఉన్నారు. ఈనాటి మన క్రైస్తవ జాతులలోని మేధావులు మతాన్ని తాము విశ్వసించక పోవడం అలాఉంచి, మతం కేవలం అనవసరమని,

మతం లేకుండా జీవయాత్ర సాగించడమే ఉచితమని బోధిస్తున్నారు.

తమ విశ్వాసం అసమగ్రంగా ఉన్నదని తెలిసినప్పుడు నూతన విజ్ఞానంతోను, తమ వివేచనాశక్తితోను సమన్వయించుకొని ఒక క్రొత్త మతాన్ని అనుసరించేవారు క్రైస్తవేతర జాతులలోనే ఉన్నారు. కాని మన క్రైస్తవులలో కొందరు మతాన్ని అర్థరహితంగా భావించడం మాత్రమే కాక, సామాన్య ప్రజలను బానిసత్వంలో అట్టిపెట్టడానికి మతాన్ని ఒక సాధనంగా వినియోగించే వారుకూడా ఉన్నారు. పైగా వీరు తమకూ ఒక మతం ఉన్నదని అనుకుంటూ తమను తాము వంచించుకుంటున్నారు.

భౌతిక ప్రపంచంలో తమ అభివృద్ధిని చూచుకుని, అర్థ రహితమైన ఊహాగానాలను గొప్ప సిద్ధాంతా లని భ్రమించి ఈనాటి క్రైస్తవులు ఎంతో పొంగి పోతున్నారు. కాని తాము వేస్తున్న ప్రతి అడుగూ వారిని అజ్ఞానంవైపుకే లాక్కునిపోతున్నదనే విషయాన్ని వారు గమనించడం లేదు. పైగా, మానవచరిత్రలో ఇదివరకు ఎన్నడూ పొందనంతటి ఉచ్ఛదశలో తాము ఉన్నట్లుగా భావిస్తున్నారు.

# 10

భౌతిక జీవితాన్నీ ఆధ్యాత్మిక జీవితాన్నీ సమన్వయించుకోడానికి మానవుడు సహజంగా యత్నిస్తాడు. ఏదో ఒక

విధంగా ఈ సమన్వయం దొరకనిదే మానవునికి శాంతి చిక్కదు. కాని ఈ సమన్వయాన్ని సాధించడానికి రెండు భిన్న మార్గాలున్నాయి. ఒకటి— మానవుడు ఒక పని చెయ్యడానికి ముందు తన వివేచనా జ్ఞానాన్ని ఉపయోగించి తద్వారా ఆ పని యొక్క ఉచితానుచితాలను గ్రహించి తదనుగుణంగా ప్రవర్తించడం.

రెండవమార్గం తన హృదయస్పందనలను అనుసరించి కొన్ని పనులను చెయ్యడం. ఆ తరువాత తన పనులను కొన్ని వాదాలద్వారా సమర్థించుకోవడం.

మొదటి మార్గాన్ని సహజంగా మతంలో విశ్వాసం ఉన్నవారు అనుసరిస్తారు. వీరు తమ వివేచనా జ్ఞానాన్ని ఉపయోగించి తాము చేయనున్న పనులయొక్క ఉచితానుచితాలను నిర్ణయిస్తారు. ఇక రెండవ పద్ధతిని అనుసరించేవారు సహజంగా మతంలో విశ్వాసం లేనివారు. వీరికి వీరి పనులను నిర్ణయించడానికి ప్రత్యేకమైన ప్రమాణాలేమీ లేవు. వీరు తమ పనులను, తమ వివేచనా జ్ఞానాన్ని సమన్వయించే పద్ధతి కూడా సరియైనదికాదు. వీరు ముందు హేతువును ఉపయోగించి ఉచితమైన పనులు చెయ్యరు. పనులు చేసినతరువాత వాటిని సమర్థించడంకోసం హేతువును ఉపయోగిస్తారు. ఒక పనియొక్క ఉచితానుచితాలను గుర్తెరిగిన వ్యక్తి తన వివేచనాజ్ఞానానికీ తానుచేసిన పనులకూ వైరుధ్యం ఉన్నట్లు

తెలిసినట్లయితే ఈ వైరుధ్యాలు లేకుండా చేయడానికి తన వివేచనాజ్ఞానా న్నంతటినీ ఉపయోగించి శాయశక్తులా సమన్వయం కొరకు కృషిచేస్తాడు.

ఇక, తాను చేసే పనులయొక్క ఉచితానుచితాలను గ్రహించలేని వ్యక్తి తన హృదయస్పందనలకు వశుడైపోయి తనకు తెలియకుండానే వైరుధ్యాల వలలో చిక్కిపోతాడు. ఇహ ఈ వైరుద్ధ్యాలను సమన్వయించలేక, పరిష్కరించలేక వీటిని దాచిపెట్టడానికి అనేక వితండవాదాలను ఉపయోగిస్తాడు. ఈ వాదాలు ఎంతో తెలివైనవిగా కనుపించవచ్చు కాని, ఈ వాదాలు సత్యానికి ఎంతో దూరమైనవి.

ఇందుచేతనే మతంలో విశ్వాసం ఉన్నవారి తర్కానికీ విశ్వాసం లేనివారి తర్కానికీ ఒక స్పష్టమైన భేదం కనుపిస్తుంది. మతంలో విశ్వాసం గలవారి తర్క పద్ధతి సూటిగా, సులువుగా సత్యానికి అనుబద్ధమై ఉంటుంది. మతంలో విశ్వాసం లేనివారి తర్కపద్ధతి సూక్ష్మంగా క్లిష్టంగా శుష్కంగా ఉంటుంది.

నేను మీకు అతి సాధారణమైన ఒక ఉదాహరణను తెలియచేస్తాను. పతితుడైన ఒక వ్యక్తి ఉన్నాడనుకోండి. ఆ వ్యక్తి వ్యభిచారి అనుకోండి. తన భార్యకు ద్రోహం చేస్తాడు, ఇతర స్త్రీలతో సంచరిస్తూ ఉంటాడు. ఆ వ్యక్తి మతంలో విశ్వాసంకల వ్యక్తి అయినట్లయితే తన తప్పును

తాను తెలుసుకుంటాడు. తన తప్పును సరి దిద్దుకోడానికి శాయశక్తులా యత్నిస్తాడు. వ్యభిచారులతో, సావాసం మానేస్తాడు. రోజూ, దైనందిన కార్యక్రమాలను హెచ్చు చేసుకుని పనిలో నిమగ్నుడవుతాడు. ఒక నిర్ణీతమైన పద్ధతిలో, జీవించడానికి యత్నిస్తాడు.

ఇలాటి శిక్షణను అతను ఎంతో సులువుగా అనుసరించగలడు. కాని ఆ వ్యక్తి మతంలో విశ్వాసం లేనివ్యక్తి అవుతే అతని తరహా వేరుగా ఉంటుంది. పరస్త్రీతో ప్రణయ కలాపం సాగించడం అధర్మం కాదని ఋజువు చెయ్యడానికి తగిన వితండ వాదాలను అనేకం లేవదీస్తాడు. ఆత్మల పరస్పర అనురాగ బంధాన్ని గురించి, సౌందర్యం,. స్వేచ్ఛ, ప్రణయం, మొదలైనవాటిని గురించి అనేక క్లిష్ట వాదాలను నెలకొల్పుతాడు. ఈ వాదాలచాటున సత్యాన్ని దాచేస్తాడు.

మతంలో విశ్వాసం లేనివారు ప్రతి విషయంలోనూ ఇలాగే చేస్తారు. తాము చేసిన పనులను సమర్థించుకోడానికి అనేక వితండ వాదాలు చేస్తారు. అసలు సత్యాన్ని దాచేస్తారు.

'మనుష్యులు వెలుగుకంటె చీకటిని ఎక్కువగా ప్రేమిస్తారని, వారు చేసే పనులు వెలుపలికివచ్చి ఋజువవుతాయనే భయంవల్ల వెలుగులోకి రాక చీకటిలోనే ఉంటార'ని సత్య సందేశం చెబుతూ ఉన్నది.

ఇందువల్లనే ఈనాటి క్రైస్తవులు మతంలో వారికి విశ్వాసం పూర్తిగానశించి, ఒక అవిశ్వాసకరమైన, అమానుష మైన జీవన వ్యవస్థను ఏర్పరిచారు. ఈ చెడునంతా అనేక వితండ వాదాల చాటున దాచారు. సాధారణ ప్రజలలో కూడా మంచికీ చెడ్డకూ తేడా గ్రహించే విజ్ఞానం పూర్తిగా నశించిపోయింది.

రాజకీయ సమస్యలనుకాని, జాతీయ, ఆర్థిక, శాస్త్ర, వేదాంత, మత సమస్యలను కాని సూటిగా సులువుగా అవగాహన చేసుకుని పరిష్కరించే వ్యక్తి ఈనాడు ఒక్కడూ లేడు. ఇహ మత, వేదాంత సమస్యల విషయం చెప్పనక్కర లేదు. అనేక వాదోప వాదాలతోను, అపార్థాలతోను ఈ సమస్యల స్వరూపం మరింత క్లిష్టమూ అస్పష్టమూ కావించబడింది. లంకె లేకుండా అనేక విభిన్న చక్రాలవలె ఈ సమస్యలు ఒక సంబంధం లేకుండా పరిభ్రమిస్తున్నవి.

# 11

ఈనాటి శాస్త్ర పరిశోధనలలో ముఖ్యంగా ఒక లోపం కనుపిస్తున్నది. ఈ శాస్త్ర పరిశోధనలన్నీ, అసలు ప్రధాన సమస్యను పరిష్కరించే బాధ్యతను అవతల ఉంచి అప్రధానమైన ఉపాంగాలను, శాఖలను పరిశోధించడానికి సాగించబడుతున్నవి. అందుచేత ఈ పరిశోధనలకు ఒక

నిర్ణీతమైన ఫలితం లేనిమాట అలా ఉంచి, పరిశోధన సాగేకొద్దీ పరిశోధన మరింతగా క్లిష్ట రూపాన్ని ధరిస్తున్నది. ఇక, శాస్త్రం చేతికి ఏవిషయం అందితే ఆ విషయాన్ని పరిశోధిస్తున్నది. కాని మత నిర్వచనాన్ని అనుసరించి పరిశోధన సాగించడం లేదు. ఏ విషయాన్ని పరిశోధించడం ప్రధానమో లేక ఏ విషయాన్ని ముందు పరిశోధించవలసిన అవసరం ఉన్నదో అన్న విషయాలను ఆలోచించడంలేదు. ఉదాహరణకు — ఈనాడు సాంఘిక శాస్త్రం, రాజకీయ ఆర్థికశాస్త్రం– అని పిలువబడుతున్న శాస్త్రాలలో ముఖ్యంగా ఒకే ఒక సమస్య ప్రధానంగా సమాలోచించ బడుతున్నది. 'ఇతరులు తమకోసం ఇంత శ్రమిస్తున్నప్పుడు కొందరు ఏపనీ లేకుండా ఎలా ఉండగలుగుతున్నారు ?'—అన్న ప్రశ్న.

మనుష్యులు వేరువేరుగా ఒకరితో ఒకరు పోటీపడి ఎందుచేత పనిచేస్తూ ఉన్నారు ? మనుష్యులంతా కలిసి పనిచేస్తే ఎంతో లాభదాయకం కదా ? — అన్న ప్రశ్న కూడా ఆలోచించబడుతున్నది. శాస్త్రం ఈసమస్యను సూటిగా సులువుగా పరిష్కరించడానికి మారుగా ఈ సమస్యనుగురించి అనేక విపరీతమైన చర్చలను సాగిస్తోంది. 'గతంలో పరిస్థితులు ఎలా ఉండేవి ? ఇప్పుడు పరిస్థితులు ఎలా ఉన్నవి ?' అని చర్చిస్తూ కూచుంటాడు శాస్త్రజ్ఞుడు. జ్యోతిష్యంలో గ్రహబలాలను మార్చలేనట్లుగానే గత ప్రస్తుతాల సంబం

ధాలను మార్చడం అసంభవమని భావిస్తాడు. పెట్టుబడి, లాభం, వడ్డీ – మొదలైన అనేక అంశాలను చర్చిస్తాడు.

కాని ఈ సమస్య ఈ విధమైన శుష్కచర్చలవల్ల పరిష్కరించబడదు. మానవులంతా సమానులని, సోదరులని, మానవులు పరస్పరం ప్రేమాదరాలతో ప్రవర్తించుకోవాలనీ విశ్వసించినప్పుడే ఈసమస్యలన్నీ పరిష్కరించబడుతాయి. అతి సులువైన ఈ పరిష్కార మార్గాన్ని ఈనాటి క్రైస్తవులు విశ్వసించకపోగా ఈ పరిష్కారమార్గాన్ని దాచి, ప్రజలను మభ్యపెట్టడానికి అనేక వితండవాదాలు సాగిస్తారు.

న్యాయపరిపాలనా విషయంలోకూడా ఇదే విధమైన అన్యాయం జరుగుతున్నది.

ఖైదు శిక్షలు, యుద్ధాలు సాగించే వారున్నారు. ఈ సమస్యను పరిష్కరించడం ఎలా? ఈ సమస్య పరిష్కారం కూడా మతదృష్టితో ఆలోచించినప్పుడు ఎంతోసులువైనదే. మతంయొక్క దృష్టిలో మానవుడు తోటి మానవుణ్ణి హింసించడం అన్యాయం. అందుచేత హింసను ప్రోత్సహించే మూఢ విశ్వాసాలను, వితండ వాదాలను పూర్తిగా నిర్మూలిస్తే ఈ సమస్య సులువుగా పరిష్కరించబడుతుంది.

ఈ సమస్యను ఈ విధంగా పరిష్కరించడానికిబదులు నాగరికులైనవారు, ఈ పరిష్కార మార్గాన్ని ప్రజలకు దాస్తున్నారు.

సివిల్ చట్టాలు, క్రిమినల్ చట్టాలు, పోలీస్ చట్టాలు మొదలైనవాటిని గురించి లెక్కలేనన్ని గ్రంథాలు వ్రాస్తున్నారు. ఈ గ్రంథాలలో ఎన్నో ముఖ్యమైన విషయాలు రచింపబడినవని ప్రజలచేత విశ్వసింప చేస్తున్నారు. 'సహజంగా మానవులంతా సమానులేకదా? ఒకరిని ఒకరు ఎందుకు హింసించుకోవాలి? ఒకరిని ఒకరు దోషులుగా పరిగణించి ఎందుకు శిక్షించవలసి వస్తున్నది?'- అన్న ప్రశ్నలను ఆలోచించరు. వీరి సిద్ధాంతంప్రకారం ఈ హింసకు కారణం మనుష్యులుకాదు. ప్రభుత్వం అనే ఒక అదృశ్య వ్యవస్థను వీరు నిర్మించారు. ఈ అదృశ్యవ్యవస్థ శ్రేయస్సు కోసమే హింస జరపబడు తున్నదని వీరు వాదిస్తారు. ఈ విధంగానే వైజ్ఞానికశాఖ లన్నిటిలోనూ ఈనాటి మేధావులు వ్యవహరిస్తున్నారు. సత్యాన్ని మరుగుపరిచి వైరుధ్యాలను దాచి ప్రజలను మరుగుపరచడానికి యత్నిస్తున్నారు.

చారిత్రిక శాఖలో ముఖ్యంగా ఎదుర్కొన బడుతున్న ప్రశ్న: 'లోకంలో అధిక సంఖ్యాకులైన శ్రామికులు ఎలా జీవించ గలుగుతున్నారు?' ఈ ప్రశ్నకు సరిగా సమాధానం చెప్పేవారు ఎవరూ కనుపించడంలేదు. పైగా ఈ ప్రశ్నను పూర్తిగా విస్మరిస్తున్నారు కూడా. చరిత్రకారులు మటుకు గంపలకొద్దీ గ్రంథాలు వ్రాస్తున్నారు. ఈ గ్రంథాలలో లూయీ 11 రాజుకు కడుపులో నొప్పి ఎలా వచ్చిందీ;

ఇంగ్లండురాణి ఎలిజబెత్తు, రష్యాలో భయంకరుడైన ఇవాన్ ఎలా ఘోరకృత్యాలు చేసిందీ వ్రాస్తారు. ఈ రాజులనూ రాణీలను సంతోషపరచడానికి కవులు ఏ ఏ పద్యాలూ వాక్యాలూ వ్రాసిందీ ఉదహరిస్తారు. అంతే.

ఇక మరో శాఖకు చెందిన చరిత్రకారు లున్నారు. వీరు ఏ ఏ దేశాలలో ఏ ఏ తరహాల ప్రజలు నివసిస్తున్నదీ, వారి అన్నపానాలు, ఆచార వ్యవహారాలు ఎలా ఉండేదీ తెలియచేస్తారు. ప్రజల జీవితాన్ని గురించీ వారి మత విశ్వాసాన్ని గురించీ వీరు ఒక్క ముక్క కూడా వ్రాయరు. అవికూడా వారి అన్నపానాల తాలూకు ఫలితా లనే వీరి అభిప్రాయం.

వివిధ దేశాల ప్రజలు అనుసరించే మతాలను, వారి విశ్వాసాలను సమగ్రంగా పరిశీలించి అవగాహన చేసుకుంటేనే కాని 'శ్రమికులు ఎలా జీవిస్తున్నారు?' అన్న ప్రశ్నకు సమాధానం చెప్పలేము.

ప్రకృతి శాస్త్రమైనా కొంతవరకు సకారణంగా ఉన్న దేమోనని మనం భ్రమపడవచ్చు. ప్రకృతి శాస్త్రంలో మానవుణ్ణి మభ్యపెట్టడానికి అట్టే అవకాశం లేదని అనుకోవచ్చు. కాని ఈ శాస్త్రవిషయంలో కూడా శుష్కవాదాలు బయలు దేరాయి. 'జీవజాలం యొక్క స్వరూపమేమిటి? జీవజాలం ఎలా విభజింప బడింది?' అనే ప్రశ్నలకు సమాధానం

చెప్పడానికి మారుగా 'అసలు జీవపదార్థం ఎలా ఉత్పన్నమైనది' అనే చికిత్స ప్రారంభించారు. ఈ విషయాన్ని గురించి ఎంత చికిత్స జరిపినా లాభం లేదు. దీన్ని గురించి అనేక వాదోపవాదాలతో కోటానుకోట్ల గ్రంథాలు రచించబడ్డాయి. ఆఖరుకు 'మనుగడకొరకు సంఘర్షణ' అనే సూత్రానికి ప్రతి మానవుడూ బద్ధుడై తీరాలని సూత్రీకరించబడింది.

ఇంతేకాక మతానికి పూర్తిగా దూరమైపోవడం వల్ల యాంత్రిక శాస్త్రం, వైద్యం, మొదలైన శాస్త్రాలు పూర్తిగా అపమార్గాలు పట్టినవి. యాంత్రిక శాస్త్రం, ప్రజాబాహుళ్యం యొక్క శ్రమను సులువుచెయ్యడానికి వినియోగించబడటానికి మారుగా శ్రీమంతుల సుఖ లాలసతకు అవసరమైన వస్తువులను తయారు చెయ్యడానికి మాత్రమే వినియోగించ బడింది. ఈ యాంత్రిక శాస్త్రంయొక్క అభివృద్ధి తాలూకు ఫలితాలు శ్రీమంతులు పూర్తిగా వినియోగించుకోగా మిగిలిన కొన్ని ఎంగిలి ముక్కలు మటుకే సామాన్య ప్రజలకు దక్కాయి.

వైద్యంకూడా ఇంతే. వైద్యశాస్త్రంకూడా శ్రీమంతుల సొత్తే అయినది. పేదసాదలకు ఎంతమాత్రం వినియోగ పడ లేదు.

కాని ఈ విపరీత ధోరణి అన్ని శాస్త్రాలలో కంటే ఎక్కువగా తత్వశాస్త్రంలో మనకు స్పష్టంగా కనుపిస్తున్నది; 'నా కర్తవ్యం ఏమిటి?' అన్నది. క్రైస్తవమతం ఈ ప్రశ్నకు

సమాధానంచెప్పింది స్పినోజా, కాంత్, షోపెన్హాహోర్, రూసో మొదలైన తత్వవేత్తలుకూడా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పారు. కాని హెగెల్ వాదం వచ్చిన తరువాత ఈ ప్రశ్న యొక్క ప్రాధాన్యం విస్మరింపబడింది. ప్రపంచంలో ప్రతిదీ సకారణమే నని హెగెల్ వాదం చెబుతున్నది. అందుచేత హెగెల్ వాదాన్ని అనుసరించిన తత్వశాస్త్రం ప్రతివిషయాన్ని పరిశోధించి సిద్ధాంతీకరించడంతో సంతృప్తి చెంది ఊరు కుంటున్నది. హెగెల్ వాదం తత్వశాస్త్రంయొక్క పతనంలో తొలి మెట్టు.

ఇహ మనుగడకొరకు మానవజాతిలో సంఘర్షణ ఉన్న దనే సిద్ధాంతాన్ని అంగీకరించడంతో తత్వశాస్త్రం పూర్తిగా పతనమైనదనే చెప్పవచ్చు. 'నీ ఇచ్ఛానుసారంగా జీవించు. ఇతరుల కష్ట సుఖాలను జీవితాలను పట్టించుకోకు' అన్నది ముఖ్యసూత్రమైంది. క్రైస్తవజాతులు ఎంతటి హీనమైన అధోదశకు పతనమైనవో చెప్పడానికి నీషే వ్రాసిన రచనలు బహుళ ప్రచారం కావడమే ఒక రుజువుగా చెప్పవచ్చు. ఇంతే కాదు. ఇటీవల దక్షిణాఫ్రికాలోను, చైనాలోను జరిగిన దురంతాలు ప్రబల సాక్ష్యమిస్తున్నాయి. ఈ దురంతాలను మత గురువులు ఆశీర్వదించారు. ప్రపంచంలో ప్రసిద్ధు లందరూ ఈ దురంతాలను కీర్తించారు కూడా. నీషే రచనలు బహుళ ప్రచారం కావడానికి కారణం ఏమిటో ఊహించ

లేకుండా ఉన్నాను. కాంత్ కాని లిబ్నిట్జ్ కాని ఇలాటి రచనలు చెయ్యలేదు. కాని ఈ రోజులలో మేధావులందరూ ఈ రచనలంటే పడి చస్తున్నారు. ఈ రచనలను గురించి వాదోపవాదాలు చేస్తున్నారు. అన్ని భాషలలోను అతని రచనలు అచ్చువేయబడుతున్నవి. తుర్గెనివ్ చమత్కారంగా అన్నట్లు - కొన్ని వితండవాదాలు ఒకొక్కసారి ప్రజల్ని ఎక్కువగా ఆకర్షిస్తాయి. నీరు తడిగా ఉన్నదనే విషయం అందరికీ తెలిసినదే. ఎవరైనా ఒకరు నీటికి తడి ఉండదని సిద్ధాంతీకరిస్తే ఈ వాదం వితండ మైనప్పటికీ ఎక్కువగా ఆకర్షిస్తుంది.

ఈ విధంగానే స్వార్థ త్యాగమూ, వాంఛాత్యాగమూ ఉత్తమ గుణాలనే విషయాలు లోక విదితమైనవి. ఈ సూత్రాలు నీషే ఊహించినట్లు ఒక్క క్రైస్తవులకు సంబంధించినవి మాత్రమే కావు. యావత్ప్రపంచానికీ సంబంధించినవి. బ్రాహ్మణ, బౌద్ధమతాలు మాత్రమే కాక అన్ని మతాలూ ఈ సూత్రాలను అంగీకరించినవి. హఠాత్తుగా ఒక వ్యక్తి ఈ ఉత్తమ గుణాలను ఒక్క క్రైస్తవ మతానికే అంటగట్టి, ఈ గుణాలు ఉత్తమమైనవి కావని, ఈ గుణాలవల్లనే ప్రపంచం నాశనమై పోతూఉన్నదనీ సిద్ధాంతీకరిస్తే మొదట్లో ఈ విపరీత సిద్ధాంతం అందరినీ కలవర పరచక పోదు. కాని కొంచెం ముందు వెనుకలు ఆలోచించిన

మీాదట వివేచనా జ్ఞానంగల ఏ వ్యక్తి అయినా ఇలాటి గ్రంథాలనూ ఇలాటి రచనలనూ త్రోసివేస్తాడు. కాని ఈనాడు మేధావులు నీషే 'అతీత మానవ' సిద్ధాంతాన్ని ఎంతో శ్రద్ధతో చర్చిస్తున్నారు. నీషేను గొప్ప వేదాంతిగా పరిగణిస్తున్నారుకూడా.

ఇందుకు కారణం లేకపోలేదు. సద్గుణాల ప్రసక్తిని వారి దృష్టికి తీసుకుని రావడం ఈనాటి మేధావులకు రుచించదు. ప్రేమ, వాంఛాత్యాగము వంటి సద్గుణాల ప్రసక్తిని తీసుకునివస్తే, వారు సాగించే పశు జీవితానికి భంగం వస్తుంది. ఇందుకని ఎంత చిందరవందరగా చెప్పబడినది అయినప్పటికీ అహంనూ క్రౌర్యాన్నీ సమర్థించే సిద్ధాంతాన్ని ఎంతో సంతోషపూర్వకంగా వీరు స్వీకరిస్తారు.

స్వర్గరాజ్యపు తాళపు చెవులను అపహరించి, తామూ ప్రవేశింపక, ఇతరులనూ ప్రవేశింప నివ్వనందుకు ఫారసీలపై జీసస్ నిందోక్తులు పలికాడు.

ఈ నాటి మేధావులు కూడా ఫారసీలవలెనే వ్యవహరిస్తున్నారు. వీరు అపహరించింది స్వర్గరాజ్యపు తాళపు చెవులు కాదు, విజ్ఞాన రాజ్యం యొక్క తాళపుచెవులను వీరు అపహరించారు. ఈ రాజ్యంలోకి వీరు మరొకరిని రానివ్వనూ రానివ్వరు, తామూ ప్రవేశింపరు.

మతగురువులు క్రైస్తవ మతాన్ని మంత్ర తంత్రాలుగా మార్చి ప్రజలకు బోధించారు. క్రైస్తవ మతానికి సర్వమానవత్వం పునాది అనే భావాన్ని ప్రజలు పూర్తిగా విస్మరించేట్లు చేశారు. పైగా క్రైస్తవమతం ఈనాటి సంఘ వ్యవస్థను పూర్తిగా అంగీకరించేటట్లు చేశారు. గ్రహాలలో తేడాలు ఉన్నట్లు మానవులలో తేడాలున్నవని, కొందరు పేదలుగా పతితులుగా ఉంటున్నారూ అంటే ఈశ్వరుని ఇచ్ఛానుసారమే ఉంటున్నారని ప్రజలకు నచ్చచెప్పారు. చక్రవర్తులకు, రాజులకు, మతగురువులకూ ఇతరులను శిక్షించడానికీ సరిదిద్దడానికీ అధికారం ఉన్నదేకాని–సామాన్య ప్రజకు ఆ అధికారం లేదన్నారు.

ఈ అపసవ్య బోధను ఆధారంగా చేసుకుని పాలకవర్గం ప్రజలను అణచివేస్తూ తమ సుఖాలకోసం, భోగాలకోసం వారి సేవలను స్వీకరిస్తున్నది. ఇక ఈ వ్యూహంలో తగులొ్కనని వారు శాస్త్రజ్ఞులు మాత్రమే. వీరుకూడా ఈ వైపరీత్యాన్ని అడ్డుకోనడం తమకు అభిమతమనే అంటున్నారు. కాని నిజానికి వీరు తమ అభిమతానికి కేవలం వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నారు.

మానవజాతిని నడిపే మూలశక్తి ఏదో గమనించి ఆ మూలశక్తి వైపుకు మానవజాతిని శాస్త్రజ్ఞులు నడిపించ

గలరని మనం ఆశిస్తాం. కాని అలా వారు చెయ్యడంలేదు. పైగా ఇది కేవలం అవసరమైన పనిగా పరిగణిస్తున్నారు.

వీరి ప్రవర్తన చాలా విచిత్రంగా కనుపిస్తుంది. వాస్తవ విషయాలను గమనించకుండా వీరు కళ్ళు మూసుకున్నారా అనిపిస్తుంది. ప్రజలకొరకు వీరు ఎంతో చిత్తశుద్ధితో అనేక చిల్లర పనులను చేస్తున్నారు. కాని అసలు అన్నిటికన్న అవసరమైన పనిని మట్టుకు విస్మరిస్తున్నారు. భుజబలంతో ఇంజను నడిపించాలనే వ్యక్తి పనిలాగా ఉన్నది వీరి ప్రవర్తన. ఆవిరి యంత్రాన్ని కదిలిస్తే చాలు; ఇంజను బయలుదేరుతుందని అతనికి తెలుసు. కాని అతను ఆ పని చెయ్యడు. మానవజాతి అనే ఇంజను సుగమంగా ప్రయాణం చెయ్యాలంటే మతమనే ఆవిరి అందుకు అవసరం.

టర్కీ సుల్తాను భద్రంగా చూచుకుంటున్న విషయం ఏది? బలంకోసం శక్తికోసం అతను దేనిపై ఆధార పడుతున్నాడు? రష్యా చక్రవర్తి ఒక పట్టణాన్ని సందర్శించడానికి వచ్చినప్పుడు తక్షణం వెళ్ళి ఒక మహాత్ముని విగ్రహానికి మ్రొక్కడానికి కారణం ఏమిటి? జర్మన్ చక్రవర్తి కెయిజర్ తన ప్రతి ప్రసంగంలోనూ భగవంతుని విషయం ఉదహరిస్తా డెందుకు? వీరు చేసే ఈ పనులకు కారణం లేకపోలేదు. ఈ చక్రవర్తు లందరికీ తమ అధికారం సైన్యంపై ఆధారపడి ఉన్నదనే విషయం తెలుసు.

ఇహ ఆ సైన్య బలంయొక్క ఉనికి మాత్రంపై ఆధార పడి ఉన్నది. ఇహ శ్రీమంతులలోకూడా భగవద్భక్తి, సదాచార సంపన్నతా కలిగినవారు ఉన్నారుకదా అని మీరు ప్రశ్నించవచ్చు.

ఇందుకు కారణం లేకపోలేదు. సంఘంలోవారి స్థానానికీ వారి మతానికీ ఒక అవినాభావ సంబంధం ఉన్నందువలన తమ ఉనికికీ తమ స్థానానికీ భంగం రాకుండా ఉండే నిమిత్తమే వారు దేవాలయాలకు వెళ్ళడం, పూజా పునస్కారాలు చెయ్యడం మొదలైన పనులు చేస్తున్నారు.

తమను తాము రక్షించుకోవాలనే ఒక బలహీనత వీరికి మతంలో విశ్వాసం కలగచేస్తున్నది. వీరు విప్లవాత్మక సమాజ వాద ప్రచారాన్ని కొంతవరకు అంగీకరించినప్పటికీ మతం పునాదులను ఆ ప్రచారం స్పృశిస్తేమటుకు వీరు సహించరు.

మానవ జాతిని నడిపించే ప్రధానశక్తి మతమేనన్న విషయానికి ఈ ఒక్క రుజువూ చాలు.

ఈ విషయాన్ని చరిత్ర ద్వారాను, మనస్తత్వశాస్త్రం ద్వారాను రుజువు చేసినా ఈనాటి మేధావులూ, విప్లవ వాదులూ అంగీకరించక పోవచ్చును. కాని పై రుజువునుబట్టి మాత్రం వీరు ఈ విషయాన్ని అంగీకరించక తప్పదు. వివిధ

జాతుల జీవన పరిస్థితులను ఎంతో సూక్ష్మాతి సూక్ష్మంగా చర్చించే ఈ మేధావులు అందరికీ కనుపించే నగ్న సత్యాన్ని గమనించకపోవడం ఎంతో శోచనీయంగా కనుపిస్తున్నది. వీరు తమ స్వలాభాన్ని దృష్టిలో ఉంచుకుని ప్రజలను అజ్ఞానంలో అట్టిపెడుతూ ఉన్నారంటే ఇంతకన్నా మోసం మరొకటి ఉండదు. జీసస్‌ను నిందో క్తులు పలికిన వంచకులు నిజంగా వీరే. వీరివల్ల మానవజాతికి జరిగేటంత ఘోరం మరెవరి వల్లనూ జరగదనడం అతిశయోక్తి కాదు. మానవుని వివేచనా జ్ఞానం ఇంతగా క్షీణించడానికి కారణం సాధారణ ప్రజలు అపసవ్యమైన మతప్రభావానికి లోనై సత్యాన్ని విస్మరించినట్లే మేధావులుకూడా ఒక అపసవ్యమైన శాస్త్రజ్ఞానం యొక్క ప్రభావానికి లోనై సత్యాన్ని విస్మరించారు.

ఈనాడు క్రైస్తవజాతుల శోచనీయ పరిస్థితులకు, మేధావులనబడే ఈ వంచకులే ముఖ్య కారకులు. వీరివల్లనే క్రైస్తవ నాగరికత నానాటికీ అధఃపాతాళానికి అణగద్రొక్కబడుతున్నది.

ప్రజలలో ఉన్న మూఢమైన మత విశ్వాసాలపై ప్రత్యేకంగా దాడి జరుపవలసిన అవసరం లేదని, శాస్త్ర జ్ఞానం అభివృద్ధి చెందితే ఈ మూఢ విశ్వాసాలు వాటంతటఅవే తొలిగిపోతాయనీ ఈ నాటి మేధావులు వాదిస్తారు. శాస్త్ర జ్ఞానం అభివృద్ధి చెందిన తరువాత, అనగా, భూమికీ

సూర్యునికీ, ఎన్నికోట్ల మైళ్ళ దూరం ఉన్నదీ, సూర్యునిలో, గ్రహాలలో ఏవ లోపాలు ఉన్నవి, మొదలైన చిల్లరవిషయా లను మానవుడు తెలుసుకున్న తరువాత మానవుడు తనంత తానే చర్చి సిద్ధాంతాలను నమ్మడం మానేస్తాడని వీరి వాదన.

ఈ వాదన చిత్తశుద్ధితో కూడినదా లేదా అనేమాట అలా ఉంచి ఈ వాదన కేవలం భ్రాంతిజన్యమైనదని, వంచనే ననీ చెప్పడానికి ఎంతమాత్రం సందేహం లేదు.

చిన్నతనంలోనే శిశువులకు మతాన్ని బోధించని తల్లి తండ్రులెవరూ ఉండరు. శిశువుల పసి మనస్సులలో ఈ బోధలు గాఢంగా ముద్రితమవుతాయి కూడా. వివేకానికి పూర్తిగా విరుద్ధమైన త్రిత్వం, మానవజాతి విముక్తికొరకు భగవంతుడు ఇహలోకంలో అవతరించడం, ఆయన సమాధి నుంచి లేచి పునర్జన్మ పొంది ఆకాశంలోకి ఎగిరిపోవడం, విశ్వాంత సమయంలో ఆయన పునరాగమనం, మతాన్ని విశ్వసించని వారికి శాశ్వత నరకప్రాప్తి— ఈ విషయాలన్నీ బాల్యంలోనే నూరిపోస్తారు. ఇలాంటి విషయాలను బాలురకు పసితనంలోనే బోధించినప్పుడు, ఇక వారు పెరిగి పెద్దవారై ఈ సిద్ధాంతాలకు సంబంధించిన వైరుధ్యాలను తర్కించుకుని ఆ వైరుధ్యాల నుంచి బైటపడగలరని భావించడం కేవలం అసందర్భంగా కనుపిస్తుంది. ఈ వైరుధ్యాలను ఎలా సమన్వయించుకోవలెనో అతనికి చెప్పేవారు ఎవరూ ఉండరు.

ఒకవేళ మత గురువులు సమన్వయాన్ని వివరించడానికి పూను కున్నా వారి వివరణ సమస్యలను మరింత క్లిష్టం చేస్తుందే కాని సమస్యా పరిష్కారానికి దోహదం చెయ్యదు. అందు చేత మానవునికి క్రమక్రమంగా జిజ్ఞాసలో విశ్వాసం నశిస్తుంది. భగవద్విషయాలను తర్కించరాదని మత గురువులు ప్రోత్స హిస్తారు కూడా. ఏది ఎలాగయినా సంభవించడానికి అవకాశం ఉన్నది. మంచి చెడ్డలకు, సత్యాసత్యాలకు తేడాను తర్కించే శక్తి తనకు లేదనుకొని వివేచనా జ్ఞానాన్ని పూర్తిగా వదిలి మానవుడు ఇతరుల బోధలను మాత్రమే అనుసరించడం ప్రారంభిస్తాడు.

ఈ విధమైన బోధలవల్ల మానవజీవితం ఎంతగా కలు షిత మవుతున్నదో ఊహించుకుంటే నిజంగా భయం వేస్తుంది.

ఒకవేళ ఆత్మశక్తి అధికంగా కలిగిన ఒక వ్యక్తి ఈ దుష్ట ప్రభావం నుంచి విముక్తి చెందడానికి యత్నించినప్ప టికీ, శరీరానికి ఎక్కించిన ఒక విషాన్ని విరిచినప్పటికీ తరు వాత కూడా ఆ విషచ్ఛాయలు అంతరించకుండా శరీరాన్ని ఆశ్రయించి ఉన్నట్లుగా, ఈ దుష్ట ప్రభావచ్ఛాయలు అతన్ని అంటుకునే ఉంటాయి. ఇలాటివ్యక్తి ఆ దుష్ట ప్రభావంనుంచి తాను బయట పడగానే మతం మానవుని పురోగామి పథంలో అడ్డురాయి అని ఈ నాటి మేధావుల నూతన దృష్టిని అవలం

బించడం సహజం. ఈ దృష్టిని అవలంబించిన వ్యక్తి తన గురువుల వలెనే అంతరాత్మను పూర్తిగా కోల్పోయి, వాంఛామయమైన జీవితాన్ని గడపడం ప్రారంభిస్తాడు. ఇందుకు తనను తాను నిందించుకోనకు కూడా. మానవునికి సాధ్యమైన మహోన్నతమైన మానసిక అభివృద్ధి తాను పొందినట్లు భావిస్తాడు. ఆత్మశక్తి అధికంగా గలవారి విషయం ఇది. ఇక అంతకన్న తక్కువ ఆత్మశక్తికలవారు తమకు కొన్ని సంశయాలు కలిగినప్పటికీ తమ చిన్ననాటి విశ్వాసాన్ని వొదులుకోనరు. తమ సంశయాలను కప్పిపుచ్చుకోనడం కోసం తమకే స్పష్టంగా బోధపడని అనేక అస్పష్ట సిద్ధాంతాలను నిర్మించుకుని ఆ సిద్ధాంతాలను ఆశ్రయించి జీవిస్తారు. ఎప్పుడూ అర్థంలేని అనుమానాలు, అస్పష్టత, క్లిష్టత, వీరిని కలవరపరుస్తుంది.

ఇక సాధారణ ప్రజలకు ఈ వంచన నుంచి విముక్తి పొందే శక్తిలేదు. వీరు తరతరాల పాటు ఈ వంచననే విశ్వసిస్తూ తమను మోసగించే పాలకవర్గాల వారి చేతిలోని కీలుబొమ్మలుగా ఉండిపోతారు. ఇది ఈనాటి ఘోర పరిస్థితి. భయంకరమైన ఈ వంచనపై సూటిగా దాడి జరపరాదని ఈ నాటి మేధావులు భావిస్తున్నారు. ఇందుకు కారణం ఈ మేధావులు కూడా ఒక అపసవ్యమైన శాస్త్రజ్ఞానం యొక్క దుష్ట ప్రభావానికి లోనై ఉండడమే. అదీ కాక, స్థిరపడి

పోయిన విశ్వాసాలపై దాడి జరపడం వల్ల స్వలాభానికి భంగం కలుగుతుందని, ప్రమాదాలకు దారి తీస్తుందని కూడా వీరు ఊహించి ఉండవచ్చు.

ఏ విధంగా చూచినా వీరు విజ్ఞానోదయాన్ని అరికట్టిన వారే అవుతున్నారు.

మతగురువుల మాటలనుంచి విముక్తి పొందడం, విముక్తిపొందిన అనంతరం మేధావుల మాయలో పడకుండా ఉండడం – ఈ రెండు మార్గాల వల్లనే మానవజాతి ఈనాటి అనర్థాలనుంచి రక్షింప బడగలదు.

ఒక సీసాలో యింతకుపూర్వం వున్న ద్రవాన్ని ఖాళీ చేసి కొత్త ద్రవాన్ని పోయాలంటే ముందు పూర్వమున్న ద్రవాన్ని పారబోయవలసి వుంటుంది. ఈ విధంగానే ప్రజలను అపసవ్యమైన ఒక మత మార్గంనుంచి మళ్ళించి వారికి నూతనమైన సత్యమతాన్ని అవలంబింప చేయాలంటే ముందు వారిని పూర్వపు వంచన నుంచి విముక్తులను చేయాల్సిన అవసరం వున్నది.

## 14

కాని, అసలు సత్యమైన మతం అంటూ ఒకటివున్నదా అని వారు ప్రశ్నించవచ్చు. మతాలు అసంఖ్యాకంగా అనంతంగా వున్నాయిగదా, యీ మతాలలో మన అభిరుచికి

సరిపోయిన మతాన్నే సత్యమయినదని అనుకోవడం సబబేనా అని కూడా వారు ప్రశ్నించవచ్చు. కాని మతంయొక్క బాహ్య చిహ్నాలను మాత్రమే గమనించి మతం అంటే అవే ననుకునేవాళ్ళు అడిగే ప్రశ్న యిది. మతాలు వేరయినా వాటి మూల సూత్రాలన్నీ ఒకలాంటివే. ఈ మతా లన్నింటికీ మూల సూత్రాలు సత్యమతంగా రూపొంది మానవులకు సరయిన బాటను చూపుతాయి. ఈ సత్యమతాన్ని అంగీకరించడం వల్లనే మానవులు అనర్థాలనుంచి విముక్తులవగలరు.

మానవజాతి పుట్టి పెరిగి ఎన్నో యుగాలు గడుస్తున్నాయి. భౌతిక ప్రపంచంలో కొత్త కొత్త విషయాలను కనిపెట్టి అభివృద్ధి చేసినట్లుగానే ఆధ్యాత్మిక ప్రపంచంకూడా నూతనవిషయాలను దర్శించి అభివృద్ధిచేసే శక్తి మానవజాతికి వున్నది. కళ్ళున్నా చూడలేనివాళ్ళు యీ విషయాన్ని చూడలేక పోవచ్చును గాని, ఈ విషయంమటుకు సత్యం కాదని ఎవరూ అనలేరు. ఈనాడు సత్యమానవులు సామాన్యంగా అనుసరిస్తూ వున్న మతస్వేచ్ఛ యే కొద్దిమంది వితండవాదుల హస్తాలలోనో లేదు. కోటానుకోట్లమంది మానవులు యీమార్గాలను అనుసరిస్తున్నారు. మానవులు యింకా రాక్షస దశకు దిగజారక పోవడానికి కారణం అన్ని జాతులకు చెందిన ఉత్తములు యీ సత్యమతాన్ని విశ్వసించటమే. ఈ సత్యమతం యొక్క సూత్రాలు మానవులందరికీ సుపరిచితమైనవి.

పసిపిల్లలయినా యీ సూత్రాలు అంగీకరించితీరుతారు. మనకు సత్యమతం క్రైస్తవమతం. అనగా యీ మతం యొక్క బాహ్య చిహ్నాలు కాదని నావుద్దేశ్యం. బ్రాహ్మణ, బౌద్ధ, మహమ్మదీయ మతాలతోను, యితర మతాల మూల సూత్రాలతోను, క్రైస్తవమతంయొక్క మూల సూత్రాలు కూడా అంగీకరిస్తాయి. కాబట్టి యే మతానికి చెందినవా రయినా సత్యమతాన్ని అంగీకరిస్తున్నా రన్నమాటే. ఇతర అన్ని మతాల మూలసూత్రాలతోను అంగీకరించే తమ తమ మూలసూత్రాలతో అంగీకరిస్తున్నారన్నమాట. ఈ మూల సూత్రాలు అర్థంకానివారు, అవగాహన చేసుకోలేనివారు, ఎవరూ వుండరు.

ఈ మూల సూత్రా లేమిటో ఉపహరిస్తాను. భగ వంతుని మాయ, సృష్టికంతా భగవంతుడే మూల కారణం; భగవదంశ మానవునిలో ఉన్నది, మానవుడు యీ అంశను తన జీవితంలో అభివృద్ధి చేసుకోడానికి అవకాశం వున్నది. క్షీణింప చేసుకోడానికి కూడా అవకాశమున్నది. ఈ దివ్యాం శను అభివృద్ధి చేసుకోవడానికి మానవుడు తన వాంఛలను, మమకారాన్ని తగ్గించుకోవాలి, ప్రేమను పెంపొందించు కోవాలి. ఇందుకు మార్గం పరోపకారం ఒక్కటే. ఇతరులు మనపట్ల ఎలా ప్రవర్తించాలనుకుంటామో మనం వారిపట్ల అలా ప్రవర్తించాలి. బ్రాహ్మణమతానికి, మహమ్మదీయ

మతానికే కాక సర్వ మతాలకూ మూల సూత్రాలు యివే. బౌద్ధమతం భగవంతుడిని ప్రత్యేకంగా నిర్వచించక పోయి నప్పటికీ, నిర్వాణస్థితిని అంగీకరిస్తోంది. నిర్వాణస్థితిలో మానవుడు పొందే తాదాత్మ్యమే ఈశ్వరుడు.

కాని మతాన్ని గురించిన యీ నిర్వచనాన్ని యీ రోజుల్లో చాలమంది అంగీకరించరు. మతం అంటే అసహజ మైన లోకాతీతమైన విషయం అని భావిస్తారు. నేను చెబు తున్నది తత్త్వశాస్త్రమో లేక నీతిబోధో అనుకుంటారు. మతం అంటే వీరి దృష్టిలో అర్థరహితమైన అసంబద్ధమైన విషయం. బోధపడనిదే మతం అని వీరి అభిప్రాయం. కాని యీ మూలసూత్రాలనించే మతం ఉత్పన్న మయింది. ఈ మూల సూత్రాలను మత సిద్ధాంతాలుగా బోధించడం వలన, ఆ మత సిద్ధాంతాలను అపసవ్యమైన ధోరణిలో నడిపించడం వలన, మహోత్సవాలు మొదలయిన మూఢ విశ్వాసాలు బయలుదేరాయి. మతానికి అవే చిహ్నాలని అనుకుంటూ వున్నారు. అసహజమైన విషయాలే మతానికి చిహ్నాలని భావించడం కుళ్ళిపోయిన ఆపిల్ పండునుమాత్రమే చూచి ఆపిల్ పండ్లయొక్క రుచి అలాగే వుంటుందని భావిం చడం లాంటిది. సృష్టిమూలానికీ మానవునికీ వున్న సంబం ధాన్ని నిర్వచించేదే మతం. ఈ సంబంధాన్ని అనుసరించే మానవజీవిత పరమార్థం అవలంబింపబడుతూ వుంటుంది.

మానవుని జీవితంలో ప్రవర్తన కూడా యీ పరమార్థాన్ని అనుసరించే నడుస్తుంది. విశ్వజనీనమైన మతం యిదే. అన్ని మతాల మూల సిద్ధాంతాలు యీ మతంతో యేకీభవిస్తాయి. మానవుడు ఈశ్వరాంశ అని అంగీకరించి తద్వారా మానవుని జీవిత పరమార్థాన్ని యీ మతం నిర్వచిస్తుంది. మానవునిలోని ఈశ్వరాంశను అభివృద్ధి చేయటమే యీ మతంయొక్క పరమార్థం. అందుకు సాధనం సర్వ మానవ సమానత. ఇతరులు మనపట్ల ఎలా ప్రవర్తిస్తారో మనం వారిపట్ల అలాగే ప్రవర్తించాలనే సూత్రం నిజంగా మతమేనా అని నాకు సందేహం. అలాగే అనుమానం చాలమందికి కలుగవచ్చు. ఈ మతంలో అర్చనలు లేవు, ఆరాధనలు లేవు, ఉపవాసాలు లేవు, వ్రతాలులేవు, యిది మతం ఎలా అవుతుందని మనం సందేహించవచ్చు. సాధారణంగా మన దేశంలో ఒక రైతు వున్నాడంటే అర్చనలూ ఆరాధనలంటే తప్పకుండా చేస్తాడు గాని యుద్ధంలోకి వెళ్ళి తన సహోదరులను చంపాలంటే మటుకు జంకడు. కాని నిజం ఆలోచిస్తే మతం యీ బాహ్య చిహ్నాలకు సంబంధించినది కాదు. విశ్వజనీనమైన సిద్ధాంతాలతో కూడుకున్నదే మతం. అర్చనలను, ఆరాధనలను, నిష్ఠా నియమాలనూ ప్రజలకు ఉపదేశించినట్లుగానే సోదర ప్రేమను కూడా ప్రజలకు ఎందుకు ఉపదేశించకూడదు ? అని నేను ప్రశ్నిస్తున్నాను. ఒకరినొకరు

చంపకూడదని, వ్యభిచారం చేయకూడదని, స్వార్థంతో పగతీర్చుకోరాదనే సూత్రాలను మతంలోని ప్రధాన భాగాలుగా, ప్రజలు నిష్ఠగా అనుసరించవలసిన నియమాలుగా ఎందుకు బోధించరాదని నా ప్రశ్న.

# 15

నిజంగా మతం యొక్క మూలసూత్రాలు మానవులందరికీ సులభంగా బోధపడేవే. వీటిలో అస్పష్టత యెంత మాత్రంలేదు. కాని, తలిదండ్రులు,పాలకులు,విద్యాబోధకులు యీ మూల సూత్రాలను పసిబిడ్డ బాలాదిగా నూరిపోయవలసిన అవసరం మాత్రం వున్నది. త్రితత్వాలను గురించి, కన్యను గురించి, ఇంద్రుడిని గురించి, త్రిమూర్తులను గురించి, కట్టు కథలు అల్లి పిల్లలకు చెప్పటానికి మారుగా భగవంతుని తత్వాన్ని గురించి పిల్లలకు బోధిస్తే ఎంత బాగుంటుంది? అని నేను ప్రశ్నిస్తాను. ఆదం చేసిన పాపాలనుంచి మానవజాతిని రక్షించటానికి భగవంతుడు తన కుమారుని ఇహలోకంలో అవతరింప చేశాడు. ఆ కుమారుడు లోకంలో ఒక మతాన్ని స్థాపించి సర్వమానవులు ఆ మతాన్ని అనుసరించాలని శాసించాడని; అందుకు ఉపవాసాలు, వ్రతాలు, నిష్ఠలు,నియమాలు ఆచరించాలని బోధించటానికిమారుగా భగవంతుడు ఒక మహాశక్తనీ, ఆ శక్తియొక్క అంశ మనలో వున్నదనీ,

మన జీవితాలలో ఆ అంశను మనం పెంపొందించుకో వచ్చు నని బోధించిన పక్షంలో మానవజాతి అంతా మారుతుంది. ప్రపంచంలో శాంతిమయమైన జీవితం స్థాపించబడుతుంది.

కాని యిలాంటిదేమీ జరగడం లేదు. అపసవ్యమతం తాలూకు వంచన నిర్మూలింప బడకపోగా మానవులు సత్యానికి మరింత దూరం అవుతున్నారు.

ఇందుకు ముఖ్యకారణం యీనాటి మానవుడు ఎంతో కాలం పాటు మతం లేకుండా జీవించి వుండటం వల్ల, వారి ఉనికినీ మనుగడనూ హింసవల్ల, తుపాకులవల్ల, ఖంగారుద్వారా రక్షించుకొనడానికి అలవాటు పడిపోయారు. అంతే కాకుండా యీ వ్యవస్థ ఎంతో సహజమైనదనీ యీవ్యవస్థను మార్పు చేయడం అసాధ్యమనీ భావిస్తారు. ఈ వ్యవస్థవల్ల లాభం పొందేవారే కాక, యీ వ్యవస్థవల్ల అనేక అవస్థలకు లోనవుతున్నవారు కూడా యీ విధంగానే భావిస్తున్నారు.

ఒక వంచకుడైన వైద్యుడు రోగాన్ని మరింత తీవ్రం చేసే మందు యిచ్చి రోగం నయమవుతుందని రోగిని మభ్య పెట్టడం వంటిదే వీరు చేస్తున్న పని. పాలక వర్గాలవారు ప్రజలను బానిసలుగా అట్టేపెట్టి మతగురువుల ద్వారా, సైన్యం ద్వారా, పోలీసులద్వారా కారాగారాల ద్వారా, వధ్యశిలల ద్వారా వీరు తిరుగుబాటు చేయకుండా వ్యవస్థను రక్షిస్తూ వున్నారు. పైగా సాంఘిక భద్రతకోసం యిలా చేస్తున్నా

మని కూడా చెబుతున్నారు. నిజం ఆలోచిస్తే సాంఘిక భద్రతకు యింతకన్నా భంగకరమయినది యింకేమీ లేదు. మన క్రైస్తవ జాతుల్లో మతం తాలూకు మూలసూత్రాలు మిగిలి వున్నప్పటికీ యీ విధమైన క్రౌర్యాన్ని దుర్మార్గాన్ని ఆచరించలేరు.

వ్యక్తి కాని సంఘంకాని అభివృద్ధి చెందాలంటే అంతరంగికంగా నైతిక పరిపూర్ణత పొందడానికి కృషిచేయటం వల్లనే సాధ్యం అవుతుంది. ఇదే మానవజీవిత సూత్రం. జీవితాలను శ్రేయోదాయకం చేయడానికి బహిరంగమైన పనులు మార్గాలు కావు. హింసద్వారా జీవితాలను ఎన్నటికీ బాగు పరచలేము. మంచుతెర రానురాను మరింతపెద్దదై మానవుల దృష్టిని మరుగు పరచినట్లుగా చెడు మానవుని మభ్య పరుస్తోందే గాని వారిని సక్రమమైన పద్ధతిలో ఎన్నడూ నడిపించడం లేదు.

సంఘ వ్యవస్థను, సంఘనీతినీ కాపాడుతా మంటూ పెద్దలు ఆచరిస్తున్న హింసామార్గాన్ని అరికట్టలేనంత వరకు, యీ హింసా మార్గాన్ని మతగురువులుకూడా అంగీకరించి ప్రజలను మభ్యపెట్టినంతవరకు సంఘం అధఃపతిత మవుతుందే గాని ఒక్క మెట్టుకూడా పైకి వెళ్ళే అవకాశం లేదు. ఇది ఒక విషవలయం వంటిది. మతం లేకపోవడం వల్ల హింసమీద ఆధారపడిన పాశవిక జీవితం యేర్పడింది. ఈ జీవితం సత్య

మతాన్ని మరింత అసాధ్యం చేసి మానవులను మభ్యపెడుతుంది. అందుచేత మానవులు యేది సహజమో యేది కర్తవ్యమో గమనించలేకుండా వున్నారు.

ఈ విషవత్తులం నుంచి విముక్తి పొందటానికి మార్గం వున్నదా, వుంటే అదేమిటి? ఈ విషవత్తులం నుంచి ప్రజలను విముక్తులను చేయవలసిన తొలి బాధ్యత ప్రభుత్వానిదే నని అనుకోవచ్చు. ప్రభుత్వమే ప్రజాజీవితాలను నడిపే బాధ్యత వహిస్తోంది కనుక, ప్రభుత్వం యిందుకు పూనుకోవాలని భావిస్తారు. హింసమీాద ఆధారపడిన సాంఘిక వ్యవస్తను మార్చి పరస్పర ప్రేమమీాదా సేవాసక్తిమీాదా ఆధారపడిన సాంఘిక వ్యవస్త స్థాపించాలనే కొందరు పెద్దలు ఇలా భావించారు. సంస్కరణ వాదులు, ఐరోపాలో కమ్యూనిస్టు సిద్ధాంతాలను కనిపెట్టిన మహాపురుషులు, చైనా సంస్కర్త 'మోటి' మొదలయిన వారంతా యిలా భావించిన వారే. బళ్ళలో పిల్లలకు సైన్యవిన్యాసాలనూ యుద్ధశాస్త్రాలనూ నేర్పరాదనీ ప్రేమసూత్రాలను నేర్పవలెననీ ప్రేమప్రదర్శనకు బహుమతులుకూడా పంచవలెననీ వీరు బోధించారు. వ్యావసాయిక సంస్కర్తలు కూడా యీ విధంగానే భావించారు. ఒక రైతు సరైన క్రైస్తవమతాన్ని ప్రజల్లో బోధించేట్లు అనుశాసనం చేయవలసిందని జార్ కు అయిదుమార్లు అర్జీ పెట్టుకున్నాడు కూడా. ప్రజాశ్రేయస్సే ఆధారంగాగల ప్రభు

త్వం ఆ ప్రజా శ్రేయస్సును కాపాడటం కోసం ప్రజలకు యే మాత్రం హాని కలగని మార్గాలనే అనుసరించవలసిందని వీరి వుద్దేశ్యం. అయితే ప్రభుత్వం మటుకు యీ బాధ్యతను ఎన్నడూ స్వీకరించలేదు, పైగా వంచనాత్మకమైన మతాన్ని సమర్థించి ఆ మతాన్ని ఎదిరించినవారిని హింసించిందికూడా. ప్రభుత్వం మతాల వంచనను అరికట్టుతుందని భావించడం మనిషి తను కూర్చున్న కొమ్మనే నరుక్కోవడం వంటిది.

ప్రభుత్వం యీ బాధ్యతను నిర్వహించని పక్షంలో తామే యీ బాధ్యత నిర్వహిస్తామని కూడా వీరంటారు. కాని వీరుకూడా ఆ బాధ్యతను నిర్వహించరు. ఎందుకంటే ప్రభుత్వంచేత రక్షింపబడుతున్న ఒకవ్యవస్థను ఎదుర్కొనడం వల్ల యేర్పడే దుష్ట ఫలితాలను వీరు ఎదుర్కొన వలసి వస్తుంది. అందువల్ల అనేక అనర్థకా లున్నాయి. అనేక హింసలకు వీరు లోను కావాలి. ఇక మతమే ఒక తప్పిదం అని భావించినప్పుడు అందుకు మారుగా మరొక సిద్ధాంతాన్ని సూచించడం జరుగుతుంది.

ఈ కారణా లన్నింటి వలనా ఈనాడు చర్చివల్ల, ప్రభుత్వంవల్ల తమపై రుద్దపడుతున్న మతమే గొప్పదని భావించే ప్రజలు కోటాను కోట్లమంది. ఇంతకన్నా మరో గత్యంతరం లేదని కూడా వీరు గాఢంగా విశ్వసిస్తున్నారు. తరతరాలుగా ప్రజలు యీ విధంగా పుట్టి పెరుగుతూ,

యీ వంచననుండి విముక్తిపొందలేకుండా వున్నారు. ఒకవేళ విముక్తిపొందినా శాస్త్రజ్ఞుల మాయాజాలంలో పడిపోతున్నారు.

ఈ పరిస్థితులన్నీ ఆలోచిస్తే యీ విషవర్తులంనుంచీ విముక్తి పొందడానికి మార్గం లేదనే అనిపిస్తుంది.

మతంలో విశ్వాసం లేనివారికి మార్గాంతరం కనిపించక పోవచ్చును కాని మతంలో విశ్వాసం వున్నవారికి మటుకు మార్గాంతరం కనిపిస్తుంది. ఉన్నత వర్గాలవారు తమ స్వలాభానికి వుపయోగించిన యీ విషవర్తులాన్ని ఛేదించటానికి అంగీకరించరు. అందుకు ప్రయత్నించరు కూడా. ఈ విధంగానే బానిసలుగా వున్న సాధారణ ప్రజలు ఒక శ్రేయస్సుకు భంగం వస్తుందని పై వర్గాలతో పోరాటానికి సాహసించరు. ఇక యీ విషవర్తులాన్ని ఛేదించ కలిగింది మతంలో విశ్వాసం వున్నవారే. సంఘం ఎన్ని వెర్రితలలు వేసినా పవిత్రమైన మతజ్వాల తమలో ఆరిపోకుండా నిలుపుకు వస్తున్న కొందరు వ్యక్తులమటుకే ఇందుకు ప్రయత్నించగలరు.

వీరి జీవితాలు అజ్ఞాతంగా ఎప్పుడూ ప్రవాసంలోనే సాగిపోతాయి. ద్వీపాంతరాలూ కారాగారాలూ వీరికి నిలయాలు. అయినా వీరుమాత్రం జీవిస్తూనే వుంటారు. మానవజాతి శ్రేయస్సు వీరిమీాదనే ఆధారపడి వుంది. వీరు

కొద్దిమందే కావచ్చు. కాని యీ విషవస్తులాన్ని వీరు మాత్రమే ఛేదించగలరు. లౌకికుడైన ఒక వ్యక్తిని నిరోధించే సాధకబాధకాలు వీరు లెక్కచేయరు. అసత్యాన్ని, వంచనను పోరాటంలో వచ్చే కష్టనష్టాలే వీరి ప్రోత్సహాన్ని యినుమడింప జేస్తాయి... ఇలాంటి వ్యక్తి పాలక వర్గాలకు సంబంధించిన వాడయితే అతను తన స్థానాన్ని కాపాడుకోనడం కోసం సత్యాన్ని మరుగు పర్చడు. పైగా తన స్వలాభాల నుంచీ విముక్తి చెంది సత్యాన్ని బహిరంగంగా బోధిస్తాడు. ఇలాంటి వ్యక్తి 'బానిసల్లో ఒకడైతే యితనుకూడా జంకకుండా అసత్యాన్ని ఎదుర్కోనడానికి పోరాటం సాగిస్తాడు. ఎటువంటి కష్టాలు గానీ బెదిరింపులు కానీ యీ వ్యక్తి ధైర్యాన్ని సడలింపచేయలేవు. సహజంగా ఒక లౌకికుడైన మానవుడు డబ్బు సంపాదించటానికి, లేక యే మహారాజునో సంతుష్టి పరచటానికి, ఎలా కష్ట నష్టాలనుభవిస్తాడో అలాగే వీరు కూడా తమ ఆశయ సాధనకోసం కష్టనష్టాలు భరిస్తారు. మతంలో విశ్వాసం వున్న వ్యక్తి అనుసరించే మార్గంయిదే. మత జ్ఞానోదయం అయిన వ్యక్తి కేవలం యిహ జీవితంతోనే సంతృప్తి చెందడు. శాశ్వతమైన అనంత జీవితాన్ని అభిలషిస్తాడు. ఈజీవితంతో పోల్చిచూచినప్పుడు ఇష్టాలూ నష్టాలూ అన్నీ అతి సహజంగా కనిపిస్తాయి. పొలం దున్నే రైతుకు శ్రమ ఎంత సహజమో యిదికూడా అంతే సహజం.

ఈ విషవస్తువులాన్ని ఛేదించగల వ్యక్తులు వీరే. వీరు ప్రపంచంలో హెచ్చుమంది లేకపోవచ్చు. సాంఘికంగా వీరు గొప్ప స్థితిలో వుండకపోవచ్చు, వీరు విద్యావిహీనులు కావచ్చు. శక్తి సామర్థ్యాలు లేనివారే కావచ్చు. కాని యెంతు గడ్డిని యావత్తు ఒక్క నిప్పురవ్వ దహించివేసినట్లుగా యీ విషవస్తువులాన్ని ఛేదించి ప్రపంచ పునరుజ్జీవనాన్ని సాధించగలరు.

మతం మార్పు చెందని ఒక శిలవంటి విశ్వాసంకాదు. ఏనాడో ఒకనాడు కొన్ని అతీతమైన పరిస్థితుల్లో ఉత్పన్నమై ఆరూపంలోనే శాశ్వతంగా వుంటుందని చెప్పటానికి వీల్లేదు. అర్చనలూ ఆరాధనలూ మతం కాదు. శాస్త్రజ్ఞులు భావించి నట్లుగా జీవితంతో సంబంధం లేని ఒక పురాతన కాలపు విశ్వాసం కూడా కాదు, మతం. మతం మానవునికీ ఈశ్వరు నికీ వున్న సంబంధం. వివేచన జ్ఞానంతోను, సమకాలీన విజ్ఞానంతోను, సమన్వయింపబడిన యీ మతమే మానవుణ్ణి పరమావధికి చేరుస్తుంది.

మానవుని అంతరాత్మ ఈశ్వరుని చేతిలోని దీపంవంటి దని హీబ్రూ సామెత వున్నది. ఈశ్వరుడసే సిద్ధి మానవు నిలో వెలగనంతవరకూ మానవుడు జంతువుతో సమానం— ఆ దీప్తి జ్వలించిన మానవుడు సర్వశక్తి సంపన్నుడవుతాడు. ఈశ్వరుడే అతనిద్వారా కొండలనైనా కదిలించి వేస్తాడు. మతం యొక్క సారాంశం, నిర్వచనం యిదే.

ఫిబ్రవరి, 1902.

2

# మతం : నీతి

కొందరు నన్ను మతాన్ని గురించి అనేక తరహాలుగా ప్రశ్నిస్తూ ఉంటారు. వారడిగే ప్రశ్నలు ఎంతో వింతగా ఉంటాయి. 'మతం అంటే మీ ఉద్దేశం ఏమిటి? మతానికీ మానవునికీ నైతిక ప్రవర్తనకు ఉన్న పరస్పర సంబంధం ఎలాంటిది? మతాన్నీ నైతిక ప్రవర్తననూ వేరు పరచడానికి వీలుంటాదా? లేక రెండున్నూ అవినాభావసంబంధం కలిగినవా?' ఇలాటి ప్రశ్నలు అనేకం.

ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పడానికి ఈ వ్యాసంలో సాధ్యమైనంతవరకూ ప్రయత్నిస్తాను.

సర్వసామాన్యంగా, నాకు తెలిసినంతవరకూ మతాన్ని గురించి మూడు తరహాలైన విభిన్న అభిప్రాయాలున్నవి.

మానవృష్టే ఈశ్వరుడు అనుగ్రహించి ప్రసాదించిన ప్రత్యక్ష సాక్షాత్కారమే మతమని కొందరు భావిస్తారు. ఈ ప్రత్యక్షానుభూతిని పురస్కరించుకుని ఈశ్వరోపాసన చెయ్యడమే మతంలోని అంతరార్థమని వీరి నమ్మకం. ఏదో ఒక మతానికి చెందినవారై, ఆ మతంద్వారానే ఈశ్వర సాక్షాత్కారం పొందగలమని గాఢంగా విశ్వసించేవారు ఈ విధమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చుతారు.

మతమంటే కొన్ని మూఢ విశ్వాసాలపై ఆధారపడిన అర్చనా విధానమని మరికొందరి విశ్వాసం. మతంలో విశ్వాసం లేక తాము ఏ మతపథాన్ని అనుసరిస్తున్నారో సమగ్రంగా నిర్వచించుకోలేని సంశయాత్ములు చెప్పే అభిప్రాయం ఇది.

ఇక మరి మూడవవాదాన్ని గురించి చెబుతాను :

ప్రజా సామాన్యాన్ని జీవితంలోవచ్చే కష్టనిష్టురాల్లో ఓదార్చి, వారికి ధైర్యం, నిబ్బరం కలగచేసి వారిని హద్దు మీరకుండా ఒక అదుపులో ఉంచడంకోసం కొందరు మహా పురుషులూ, విజ్ఞాన ఖనులూ ఏర్పాటుచేసిన వివిధ నియమాల సమాహార స్వరూపమే మతమని వీరి అభిప్రాయం. ప్రభుత్వంమీద ప్రజలు తిరుగుబాటు చెయ్యకుండా సాఫీగా ప్రభుత్వాన్ని సాగించడానికి మతాన్ని ఒక సాధనంగా ఉపయోగించుకునే పెద్దలు చెప్పే మాట ఇది.

మానవ క్షేమానికి మతం అత్యావసరమనీ మతం వినా మానవ క్షేమానికి భంగం వాటిల్లుతుందనీ మొదటి వారి అభిప్రాయం.

రెండవవారి ఉద్దేశంలో మతం అన్నది ఒక మూఢ విశ్వాసం. ఈమూఢ విశ్వాసంనుంచి విముక్తి కలగచేస్తేనేకాని మానవజాతికి క్షేమం కలగదని వీరి అభిప్రాయం.

ఇక మరి మూడవశాఖకు చెందినవారి అభిప్రాయంలో మతం ఒక సాధనం మాత్రమే. వైజ్ఞానికంగా పరిపక్వత పొందిన ఉత్తమ మేధావులకూ సంస్కృతి సంపన్నులకూ మతంతో నిమిత్తం లేదనీ సామాన్య ప్రజకోసం మటుకు మతం అవసరమనీ వీరి అభిప్రాయం.

ఈ నిర్వచనాలను గురించి ఒక చిన్న పోలిక చెబుతాను. ఒక గాయకుడుంటాడు. ఆ గాయకుడికి ప్రియతమమైన ఒక రాగం ఉంటుంది. ఆ రాగాన్నే అందరికీ నేర్పాలని ఆ గాయకుడు భావిస్తాడు. ఇలాంటిదే తొలి నిర్వచనం.

ఇక రెండవ నిర్వచనం ఎలాంటిదో కూడా వివరిస్తాను. ఒకనికి సంగీతం అంటేమాత్రం ఇష్టం ఉండదు. సంగీతమంటే గాత్రం ద్వారానో లేక కొన్ని వాయిద్యాల ద్వారానో సృష్టింపబడే కొన్ని శబ్దాల కలయిక అని అతని ఉద్దేశం. అందుచేత ఎంత దూరంలో ఉంచితే అంత మంచిదని అతను భావిస్తాడు.

ఇక మూడవ నిర్వచనానికికూడా పై పోలికను అన్వయిస్తాను. సంగీతం, నృత్యాది వినోదాలకూ సైనిక విన్యాసాలకూ వినియోగపడే ఒక సాధనమని భావించడం ఎలాంటిదో పై నిర్వచనం అలాంటిదే.

సంగీతాన్ని గురించి ఇన్ని విధాలైన పరస్పర విరుద్ధమైన నిర్వచనాలు ఎంచాత ఉత్పన్న మయినవనే విషయాన్ని మనం పర్యాలోచించిచూస్తే మనకు ఒక విషయం స్పష్టంగా కనుపిస్తుంది. సంగీతంయొక్క మౌలిక స్వభావ స్వరూపాలను అవగాహన చేసుకోకుండా, తమ దృష్టినుంచి మాత్రమే నిర్వచించడానికి నిర్వచనకారులు పూనుకోవడంవల్ల ఇలాటి వైరుధ్యాలు ఏర్పడుతున్నవి.

తొలి నిర్వచనకారుడు మతాన్ని గట్టిగా నమ్ముతున్నాడు.

రెండవ నిర్వచనకారుడు, మతాన్ని అనేక ప్రజలు నమ్మడం పొరపాటువల్ల జరుగుతున్నదని అభిప్రాయ పడుతున్నాడు.

ఇక మతంలో ప్రజలకు విశ్వాసం ఉంచేట్లుగా చెయ్యడం అవసరమని మూడవ నిర్వచనకారుడు భావిస్తున్నాడు.

ఈ మూడు దృక్పథాల్లోను ఒక లోపం కనుపిస్తూ ఉంది. ముగ్గురూ, మతాన్ని కేవలంగా అర్థం చేసుకుని

నిర్వచించడానికి యత్నించకుండా తమ వ్యక్తిగత సృష్టిని పురస్కరించుకుని మతాన్ని నిర్వచిస్తున్నారు.

తొలి నిర్వచనం నిర్వచనకారుడికి మతంలో ఉన్న విశ్వాసాన్ని తెలియచేస్తున్నది. రెండవ నిర్వచనం ప్రజా సామాన్యానికి మతంపట్లగల అభిప్రాయాన్ని తెలియ చేస్తున్నది. మూడవ నిర్వచనం ప్రజలు మతాన్ని ఏరూపంలో విశ్వసిస్తున్నారనే విషయాన్ని తెలియచేస్తున్నది.

కాని అసలు విశ్వాసం అంటే ఏమిటనే విషయాన్ని మనం విచారిద్దాం. విశ్వాసం పుట్టు పూర్వోత్తరాలను గురించి కూడా యోచిద్దాం.

ప్రకృతి రహస్యాలను అర్థం చేసుకోవడం వల్ల ప్రకృతి శక్తులకే దేవతా రూపాలను ఆపాదించి ఆరాధించడం జరుగుతున్నదని, ఇందువల్ల ఏర్పడిన భయంవల్లను అజ్ఞానం వల్లను మతం ఏర్పడినదనీ ఈ రోజుల్లో అనేకమంది విజ్ఞానులు భావిస్తూ ఉన్నారు.

ప్రపంచంలో వైజ్ఞానికుల్లోను, చదువుకున్న వారిలోను హెచ్చుమంది మారుమాట చెప్పకుండా పై అభిప్రాయాన్ని అంగీకరిస్తూ ఉన్నవారే. ముఖ్యంగా శాస్త్రజ్ఞులు ఈ అభిప్రాయాన్ని ఎంతో బలపరుస్తూ ఉన్నారుకూడా. ఒకవేళ, మార్క్సుముల్లర్ వంటి మేధావులు, ఎక్కడో అక్కడక్కడా చెదురు మదురుగా ఈ అభిప్రాయాన్ని కాదంటూ మతాన్ని

మరోవిధంగా నిర్వచించడానికి యత్నిస్తున్నా, సముద్రంలో నీటిచుక్కలాగా వారిమాట ఆవిరిగిపోతూఉంది.

పంథొమ్మిదవ శతాబ్దపు తొలిభాగంలోనే ఎందరో మేధావులు కాథలిక్ మతాన్ని, ప్రొటెస్టెంట్ మతాన్ని, గ్రీక్ సనాతన మతాన్ని తిరస్కరించినప్పటికీ మొత్తంమీద మతాన్నిమటుకు తిరస్కరించలేదు. మతానికీ మానవ జీవితానికీ అవినాభావ సంబంధం ఉన్నదని విశ్వసించారు. వాల్టేర్, రాచెస్, పెరీలుకూడా ఈశ్వరునికి ప్రతీకలు నెలకొల్పారు.

కాని, ఈ రోజుల్లో, అగస్ట్‌కామ్టీ అర్థరహితంగా చేసిన బోధలవల్ల మత విశ్వాసాన్ని గురించి కొంత కల్లోలం ఏర్పడింది. కాథలిక్ మతమే క్రైస్తవ మతమని ఫ్రెంచివారందరూ నమ్మినట్టుగానే అగస్ట్ కాంటీకూడా నమ్మాడు. మానవజాతి పురోగమనంలో మతం ఒక ప్రత్యేకదశ అని అగస్ట్ కాంటీ చెప్పిన సిద్ధాంతాన్ని వైజ్ఞానికులుగా చలామణీ అవుతున్న అనేకమంది విశ్వసించారు. మానవజాతి పురోగమనంలో మత, ఆధ్యాత్మిక దశలను దాటిపోయినదని, ఇప్పుడు మానవజాతి చరిత్రలో వైజ్ఞానిక శాస్త్రఘట్టం ప్రవేశించినదనీ వీరు విశ్వసిస్తున్నారు.

ప్రకృతి శక్తులను అవగతం చేసుకోలేక మానవుడు భయం చెందడం వల్లనే మతంలో విశ్వసించడం జరుగుతున్న

దని కూడా వీరి విశ్వాసం. అర్థంకాని ప్రకృతి శక్తులకు అనేక ఊహారూపాలు నిర్మించి మానవుడు ఆ రూపాలుగా అర్చిస్తున్నాడని వీరి అభిప్రాయం.

కాని, ఈ విషయాన్ని గురించి విచారించడానికి ముందు మనం మరొకవిషయాన్ని యోచించవలసిఉంటుంది.

అదృశ్య దైవరూపాలలో మానవునికి విశ్వాసం, ప్రకృతి శక్తులను అర్థం చేసుకోనక పోవడం వల్ల ఏర్పడిన భయం వల్లనే కలిగినదనే వాదం ఎంతవరకు సబబుగావున్న దనే విషయాన్ని విచారించడానికి మునుపు, అసలు అప్రత్యక్ష రూపాలకు మానవుడు ఊహా కల్పన చెయ్యడానికి కారణా లేమిటనే విషయాన్ని మనం విచారించాలి. సోక్రటీస్, డెకార్ట్, న్యూటన్ మొదలైన విజ్ఞానవేత్తలు ప్రకృతిశక్తులను అవగతం చేసుకున్న వారై కూడా అతీతశక్తిని విశ్వసించారు. మనుష్యులు ఉరుమును, మెరుపునూ చూచి భయంచెందారను కోండి. అవుతే అంతమాత్రంతో భయం చెంది ఊరుకోక, ఉరుములకూ మెరుపులకూ వెనుక జూపిటర్ అనే ఒక దేవుడున్నాడని, ఆ దేవుడు బాణపరంపరలను కురిపించడం చేతనే మెరుపులూ ఉరుములూ ఉత్పన్నమైనవనీ భావించడం ఎంచాత జరుగుతున్నదనే విషయాన్ని మనం విచారించాలి.

మృత్యువంటే మనుష్యులకు భయం వుండడం సహజం కాని ఇంతటితో ఈభయం ఆగిపోవడం కాదు. కల్పితాలైన

మృతాత్మలతోను, భూత ప్రేతాలతోను మనుష్యులు సంభాషిస్తున్నట్లు ఊహిస్తున్నారు. పిడుగుపాటుకు భయపడే మనుష్యులు దాగిపోతున్నారు. మృత్యువునుంచి తప్పించుకోవాలని యత్నిస్తున్నారు. కాని, తాము నిశ్చయంగా ఆధారపడగల ఒక అతీతశక్తిలో మనుష్యులు విశ్వసిస్తున్నారంటే దానికి కేవలంగా భయం కారణమని మనం ఊహించలేము. ఇందుకు అనేక ఇతర కారణాలు ఉండితీరాలి. ఈ కారణాలను మనం అన్వేషించినప్పుడే మతంయొక్క స్వరూపాన్నికూడా మనం సమగ్రంగా అవగతం చేసుకోగలం.

మత భావన మనిషిలో ఎలా కలిగిందన్న విషయాన్ని విచారిస్తే మనకు ఒకవిషయం తెలుస్తుంది. బాల్యంలోకూడా కొందరిలో మత భావన కలగడం మనం గమనించవచ్చు. బాహ్యప్రకృతిని చూచి భయం చెందడం వల్ల ఈ భావన కలిగిందని అనుకోడానికి అవకాశం లేదు. అంతర్నిహితమైన ఒక చైతన్యం వల్లనే ఈ మతభావన కలుగుతున్నది. మనిషి తన అల్పత్వాన్ని, ఒంటరితనాన్ని, పాపస్వభావాన్ని గుర్తించడం వల్లనే ఈ భావన ఏర్పడుతున్నది. అందుచేత మతమన్నది మానవజాతి శాశ్వత లక్షణాలలో ఒకటనే విషయాన్ని మనం తెలుసుకోనవచ్చు. పరిశీలనవల్ల కాని, స్వానుభూతివల్ల కాని మనకు ఈ విషయమే స్పష్టమవుతుంది. ఒక దశలో మానవులు చేశారని భావించబడుతున్నట్లుగా, ప్రాకృ

కతి శక్తులకు భయంచెంది ఊహాజనిత మైన రూపాలను ఆరా ధించడం మతం స్వరూపం కాలేదని, మతం పూలవృని అంతర్నిహితమైన లక్షణాలలో ఒకటన్న విషయం మనకు స్పష్టంగా రుజువవుతుంది. మనిషి మనిషిగా మనినంతకాలం ఈ భావన పోదు. మతం ఉండనే ఉంటుంది. అనంతమైన విశ్వంతో పోల్చిచూచినప్పుడు తన అల్పత్వాన్ని, తను ఎన్నింటిని అందుకున్నా అందనిది మరేదో ఉన్నదనే విష యాన్ని మనం గుర్తుంచుకున్నంత కాలం మతం అజరా మరంగా ఉంటుంది.

మనిషి లోకంలో పుడుతూ ఉన్నాడు. శైశవంలో అతని ప్రవర్తన పశుప్రవృత్తికి సంబంధించిన ప్రేరేపణలపై ఆధారపడి వుంటుంది. కాని మనిషి శైశవ బాల్యావస్థలు దాటి ఉచితానుచిత వివేకం కలిగినవాడిగా తనచుట్టూఉన్న పరిసరాలను తోటి మానవుల జీవితాలను గమనిస్తున్నాడు. తన చుట్టూ అనేక జీవితాలు ఒక నియతిని అనుసరించి సాగి పోతున్నాయి. తన చుట్టూ జీవిత ప్రవాహం ఇంకిపోకుండా సాగిపోతున్నప్పటికీ తన ఒక్కని జీవితం మటుకే ఈ జీవన ఖేలకు దూరంగా వున్నట్లు, తనకు ఒక్కనికే మరణశిక్ష విధింపబడినట్లు, తను మరణించి తిరిగిరాని శూన్యంలో కలిసి పోయేట్లు అతను భావిస్తాడు. తను జీవితంలో చేసినపనులన్నీ అతనికి అసంతృప్తికరంగా కనుపిస్తాయి. ఈ విషయాన్ని

యోచించిన ప్రతి మనిషికి 'నే నెందుకు పుట్టినట్లు? అనంత మైన ఈ విశ్వంలో క్షణికమైన నా జీవితానికి అర్థం ఏమిటి?' అన్న ప్రశ్న పొడగట్టక పోదు. మానవత్వం గల ఏ మనిషి నైనా ఈ ప్రశ్న బాధిస్తుంది.

ఈ ప్రశ్న పొడగట్టని మానవుడంటూ ఉండడు. అయినా, ప్రతిమనిషీ ఈ ప్రశ్నకు తనకు తోచినవిధంగాను సమాధానం చెప్పుకుంటాడు. ఈ ప్రశ్నకు సమాధానం అన్వేషించడమే మతం. 'నే నెందుకు జీవిస్తున్నాను ? ఈ అనంత విశ్వంలో నా సాధనం ఏమిటి ?' అనే ప్రశ్నకు సమాధానం చెప్పుకోవడమే మతం.

తత్వబోధలు, అర్చనాక్రమాలు – ఇవన్నీ మతానికి బాహిర చిహ్నాలు మాత్రమే. ఇవి ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క రీతిగా ఉంటాయి. భౌగోళిక, చారిత్రక పరిస్థితులను అనుసరించి మారుతుంటాయి. మనిషికీ, విశ్వానికి ఉన్న సంబంధాన్ని నిర్ణయించడం ప్రతి మతానికి ప్రాతిపదిక. నాగరకుల మతంకాని, అనాగరకుల మతంకాని, ఎలాటి మత మైనా ఈ ప్రాతిపదికపై నే ఆధారపడి ఉంటుంది. ఏవిధమైన అర్చనాక్రమానికైనా ఇదే మూలం. ఏ మత మైనప్పటికీ, ఆ మతబోధకుడు, తనకూ విశ్వానికి ఉన్న సంబంధాన్ని గురించి యోచించి చెప్పిన విషయంపై నే ఆధారపడి ఉన్నది.

మనిషికీ విశ్వానికీ ఉన్న పరస్పర సంబంధాన్ని గురించిన నిర్వచనాలు అనేక తరహాలుగా ఉంటాయి. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్కరీతిగా కన్పిస్తుంది. ఆ యా దేశాలకూ ఆయా జాతులకూ సంబంధించిన బోధకులు చెప్పే నిర్వచనాలపై ఆ మతస్వరూపాలు ఆధారపడి ఉంటాయి.

ఇంతేకాదు. ఈ మత ప్రవక్తల బోధలకు అనేక రకాలైన వ్యాఖ్యానాలున్నాయి. ప్రవక్తల బోధలకు వారి అనుచరులు విపరీత వ్యాఖ్యానాలు కూడా చేశారు. అందువల్లనే ఈ సిద్ధాంతాలు అసంఖ్యాకంగా కనుపిస్తాయి. ఈ సిద్ధాంత రాద్ధాంతాలు అసంఖ్యాకంగా ఉన్నప్పటికీ ముఖ్యమైన సిద్ధాంతాలు మూడు మటుకు మనకు స్పష్టంగా కనుపిస్తాయి.

(1) అనాదిగా మనిషికి వ్యక్తిగతంగా ఈశ్వరునితో ఉన్న సంబంధం. (2) సంఘం లేక కుటుంబానికీ ప్రభుత్వ వ్యవస్థకుగల సంబంధం. (3) దివ్య సంబంధం.

అసలు మరింత నిక్కచ్చిగా చెప్పాలంటే ప్రపంచానికీ మానవునికీ గల సంబంధాన్ని నిర్వచించే ముఖ్యమైన దృక్పథాలు రెండేరెండు ఉన్నాయి. ఒకటి మానవుని వ్యక్తిగత క్షేమానికి సంబంధించిన దృక్పథం. ఈ దృక్పథంయొక్క లక్ష్యం మానవుని వ్యక్తిగత క్షేమం మాత్రమే. మానవుడు ఈ క్షేమాన్ని కేవలం వ్యక్తిగతంగా సాధించుకో వచ్చును. లేక సమష్టి సాయంతోనైనా సాధించుకో వచ్చును. ఇక

రెండవ ధృక్పథం క్రైస్తవ ధృక్పథం. ఈ ధృక్పథానికి లక్ష్యం జగత్సేవ.

ఈ రెంటిలోనూ తొలి ధృక్పథానికి ముఖ్యమైన లక్ష్యం మానవుని స్వార్థమేనని ఇంతకు మునుపే వివరించాను. ఈ ధృక్పథాన్ని అనుసరించి మానవుడు స్వార్థపరుడు. మంచి చెడ్డలతో నిమిత్తం లేకుండా స్వార్థ సుఖాన్ని సాధించడానికి మానవుడు ఏమైనా చెయ్యవచ్చు. ఇలాటి మానవుడు ఇతరులకు తనవల్ల హాని కలుగుతుందనికూడా సంశయించడు.

అనాదిగా ఉన్న ఈ ఆదిమ దృష్టిని ఆధారంగా చేసుకుని అనేక మతాలు బహిర్గతమైనాయి. ఆదిమ కాలంలో మానవులు అవలంబిస్తూ వచ్చిన అనేక మతాలు ఈ దృష్టి నుంచి ఏర్పడినవనే చెప్పవచ్చు. ఇంతేకాక, బౌద్ధమతం, టావ్, మహమ్మదీయ మతాలు, క్రైస్తవ మతంయొక్క విపరీత స్వరూపాలూ ఏర్పడినవి. ఆధునిక కాలంలోని ఆధ్యాత్మిక వాదానికి కూడా వ్యక్తి సంక్షేమమే ముఖ్య లక్ష్యం. అర్చనలు, ఆరాధనాక్రమాలు, వరప్రసాదాలు, ప్రార్థనలు, బలులు మొదలైన అన్నింటికినీ ఇదే దృష్టిమూలం.

ఇక ఈ దృష్టి రెండవదశ ఒకటి ఉన్నది. ఈ దశను గురించి కూడా వివరిస్తాను. ఈ దశలో మానవుడు కేవలం వైయక్తిక సంక్షేమాన్ని మాత్రమే లక్ష్యంగా ఉంచుకోడు. సమిష్టి దృష్టిని అలవరచుకుంటాడు. ఒక కుటుం

బాన్ని, ఒక వర్గాన్ని, ఒక జాతిని, ఒక సామ్రాజ్యాన్ని రూపొందించుకుని తన క్షేమానికీ వాటి క్షేమానికీ బాంధ వ్యాన్ని నెలకొల్పుకుంటాడు.

ఈ దశలో మానవ జీవితానికి కేంద్రం కేవలంగా వ్యక్తిమాత్రమే కాక కుటుంబం కేంద్రమవుతున్నది. ఈ దృష్టిని ఆధారంగా చేసుకుని కొన్నిమతాలు బాహిరిల్లాయి. చైనీయుల మతం, జపాన్ వారి మతం, జూమతం, రోమన్ ప్రభుత్వ మతం మొదలైన మతాలన్నీ ఈదృష్టికి సంబంధించి నవే. ఈ మతాల్లో సాంఘిక తత్వం ముఖ్యంగా కనుపిస్తుంది.

చైనా జపాన్ జాతివారిలో మనకు ముఖ్యంగా కను పించే పితృ పితామహుల అర్చనకు సంబంధించిన ఆరాధనా క్రమాలు, రోమ్‌లో చక్రవర్తులను ఈశ్వరాంశ సంభూతు లుగా భావించి అర్చించడము, జూలమతంలో అసంఖ్యా కంగా కనుపించే ఆచారాలు ఆరాధనలు, క్రైస్తవ చర్చిల లోని ప్రార్థనాక్రమాలు, మానవునికీ విశ్వానికీ గల ఈ బాంధవ్యం పైనే ఆధారపడి రూపొందించ బడినవి.

ఇక మూడవదృష్టి క్రైస్తవదృష్టి. ఈ దృష్టిని అవ గతం చేసుకోడానికి మానవజాతి ఇప్పుడిప్పుడే ప్రారంభిస్తున్న దని నా ఉద్దేశం. ఈ దృష్టికి మానవుని వ్యక్తిగత స్వార్థ పూరిత క్షేమం కాని, సమష్టిక్షేమంకాని లక్ష్యంకావు. జగ త్పిత సేవ ఒకటి మాత్రమే ఈ దృష్టి లక్ష్యం. ఈ సేవకూడా

ఒక ప్రయోజనాన్ని ఆశించి చేశే సేవకాదు. సేవకోసమే చేసేసేవ.

మనం ఎరిగి వున్నంత వరకు మహోదాత్తమైన మత తత్వం ఈ దృష్టినుంచే ఉత్పన్నమైనది. ఈ దృష్టితాలూకు బీజాలు మటుకు ఇంతకుపూర్వం అనేక మతాల్లో ఉన్నవి. పైగారియన్లలోను, ఈజిప్ట్ మతాలలో, పర్షియన్ల మతాలలో, బ్రాహ్మణ బౌద్ధ మతాలలో ఈ దృక్పథం తాలూకు బీజాలు వున్నవి.

ప్రపంచంలోని మతాలన్నిటికీ ఆధారభూతమైనదృక్పథాలు ఈ మూడు మాత్రమే.

పశుదశను దాటి మానవదశను పొందిన ప్రతి మానవుడూ ఈ దృక్పథాలలో ఏదో ఒక దృక్పథాన్ని అనుసరించక తప్పదు.

తనకూ తనచుట్టూ ఉన్న విశ్వానికీ ఉన్న సంబంధాన్ని గురించి ఏదో ఒక దృష్టి కలిగి ఉండని మానవుడంటూ లోకంలో ఉండడు. అలా ఉండడం అసంభవం. ఎంచాతనంటే తను నివసిస్తున్న లోకంలో ఏదోఒకవిధమైన సంబంధం లేకుండా జీవించడం అంతో ఇంతో జ్ఞానం ఉన్న మానవునికి దుర్లభమైన విషయం. ఇంతవరకు మానవుడు ఊహించిన దృక్పథాలు పై మూడే కనుక ఈ మూడు దృక్పథాలలోను ఏదో ఒక దృక్పథానికి చెందని మానవుడు ఉండడని మనం

నిర్ణంచుకోవచ్చు. అందుచేత, క్రైస్తవప్రపంచం, మతంతో నిమిత్తంలేని ఒక ఉన్నతశిఖరాన్ని అందుకున్న పనడం కేవలం భ్రాంతి. క్రైస్తవప్రపంచం మతంతో నిమిత్తం లేదని అంటున్నారంటే క్రిందిదశల్లోనే వీరున్నారని, తమకు తెలియకుండానే క్రైస్తవమతానికి పూర్వాపు మతాలను అన్వయిస్తున్నారని మనం నిస్సందేహంగా చెప్పవచ్చు. మతంలేని మానవుడంటూ ఎవడూ వుండడు. అంటే విశ్వంతో ఏదో ఒక విధమైన సంబంధం కలిగిఉండని మానవుడంటూ ఉండడని. హృదయకోశం లేని మానవుడు మనగలగడం ఎంత సాధ్యమో మతంలేని మానవుడు ఉండడం అంతే సాధ్యం.

అయితే, ఇప్పుడు మీరు నన్ను మరో ప్రశ్న అడగవచ్చు. మానవునికీ, విశ్వానికీ గల పరస్పర సంబంధాన్ని నిర్వచించే బాధ్యత మతానికి లేదని, అది తత్వశాస్త్రానికి, లేక వైజ్ఞానిక శాస్త్రానికి సంబంధించిన విషయమనీ మీరు అనవచ్చు. కాని నా ఉద్దేశంలో ఇది నిజం కాదు. తత్వశాస్త్రం కాని, వైజ్ఞానిక శాస్త్రం కాని ఈ సంబంధాన్ని నిర్వచించగలదని భావించడం కేవలం పొరబాటని నా నమ్మకం. ఇలా భావించడం వల్లనే, ఈ రోజున సభ్య సమాజంలో మత, శాస్త్ర, నైతిక ప్రవర్తనలకు గల పరస్పర సంబంధాన్ని స్పష్టంగా అర్థం చేసుకోలేని గందరగోళం ఏర్పడింది.

వైజ్ఞానిక శాస్త్రం కాని, తత్వశాస్త్రం కాని ఈ సంబంధాన్ని నిర్వచించలేవు. వైజ్ఞానిక తత్వశాస్త్రాలు మానవజాతిలో ఉత్పన్నమై అభివృద్ధి చెందక మునుపే మత భావన మానవునిలో అంతర్నిహితంగా ఉన్నది.

మానవుడు ముందుగా ఇదమిత్థమని నిర్ణయం చేసుకోకుండానే అతని సంచలనం ఒక అవధికి అభిముఖంగా ఒక పద్ధతిలో సాగినట్లుగా, స్వాభావికంగానే నిర్దిష్టమై ఉన్న మత భావనను వైజ్ఞానిక తత్వశాస్త్రాలద్వారా పృథక్కరించడం సాధ్యం కాదు. మానసిక వ్యాపారానికి అవధిని నిర్ణయించేది మత భావనే కాని, వైజ్ఞానిక తత్వశాస్త్రాలు మటుకు కాదు. ప్లేటో, షోపెన్‌హోర్ మొదలుగాగల తత్వశాస్త్రవేత్తలందరూ తమతమ విచారణలో మతాన్నే సూటిగా అనుసరించారు. ప్లేటో, వ్యక్తుల సంక్షేమాన్ని గురించీ ప్రభుత్వ వ్యవస్థలో వ్యక్తుల సమష్టి సంక్షేమాన్ని గురించీ విచారించాడు. మధ్య యుగాలనాటి క్రైస్తవ తత్వంకూడా వ్యక్తి మోక్షాన్ని గురించినదే. వ్యక్తిమోక్షానికి మార్గాలను మాత్రమే అన్వేషించినది, వ్యక్తి ఈ జన్మలో మోక్షాన్ని సాధించడంద్వారా మరణానంతర జీవితంలో సంక్షేమాన్ని సాధించగలడని ఈ తత్వ సారాంశం.

హెగెల్, కాంట్ మొదలైన ఆధునిక తత్వవేత్తల విచారణకు సాంఘిక ప్రభుత్వ క్షేమానికి అన్వయింపబడిన

మత దృష్టి ప్రాతిపదిక. షోపెన్‌హాక్ నిరాశా వాదానికి బౌద్ధ సిద్ధాంతాలకు కొంత పోలిక కనుపిస్తుంది.

ఏతావతా తేలిన దేమంటే, మానవునికీ విశ్వానికీ మతం ఏర్పరిచిన సంబంధం తాలూకు ఫలితాలను పరిశోధించడం మాత్రమే తత్వశాస్త్రంయొక్క కర్తవ్యమని. ఈ పరస్పర సంబంధాన్ని నిర్వచించుకో లేనంతవరకు తత్వశాస్త్రంవల్ల ఏవిధమైన ఉపయోగం కాని ఉండదు. వైజ్ఞానిక శాస్త్రంయొక్క లక్ష్యంకూడా ఇదే. మానవునికీ విశ్వానికీ గల పరస్పర సంబంధాన్ని పరిశోధించడమే వైజ్ఞానిక శాస్త్రం యొక్క లక్ష్యం.

శాస్త్రానికి అందుబాటులో లేని విషయం ఏదీ లేదని శాస్త్రవేత్తల అభిప్రాయం. కాని ఈ అభిప్రాయం నిజం కాదు. శాస్త్రం ప్రతి విషయాన్నీ పరిశోధించగల దనుకోడం పొరబాటు. మతం నిర్దేశించిన విషయాలను మాత్రమే శాస్త్రం పరిశోధించగలదు. అందుచేతనే శాస్త్రమనేది ఒక అవిభక్తమైన ముద్దవంటిది కాదు. అనేక శాస్త్రాలున్నట్టే అనేక మతా లున్నవని మనం అంగీకరించాలి. ప్రతిమతమూ పరిశోధనకు కొన్ని విషయాలను ఏరుకుంటుంది. ఆనాటి శాస్త్ర పరిశోధనపైన కూడా ఈ ప్రభావం ఉంటుంది.

ఈనాటి పునరుజ్జీవన యుగంలో క్రైస్తవ శాస్త్రంగా పిలవబడుతూ ఉన్న శాస్త్రంకూడా మానవుని క్షేమానికి

ఏవిధమైన పరిస్థితులు అవసరమనే విషయాన్ని మటుకే పరిశోధిస్తుంది. బ్రాహ్మణ, బౌద్ధ తత్వశాస్త్రాలు సైతం ఈ విషయాన్నే పరిశోధించాయి. ఈనాడు మొలకెత్తుతున్న క్రైస్తవమతం, 'మానవ జీవిత పరమార్థం ఏమిటి? ఈశ్వరేచ్ఛను మానవుడు నిర్వర్తించడం ఎలా?' అనే విషయాన్ని పరిశోధిస్తుంది.

తత్వశాస్త్రంకాని, వైజ్ఞానిక శాస్త్రంకాని, మానవునికీ విశ్వానికీ గల సంబంధాన్ని ఎట్టివిధంగానూ నిర్వచించలేవు. శాస్త్రోత్పత్తికి పూర్వమే ఇట్టి సంబంధం నిర్దిష్టంగా నిర్వచింపబడి ఉన్నది. తత్వ వైజ్ఞానిక శాస్త్రాలు కేవలం వైజ్ఞానికంగా మాత్రమే పరిశోధిస్తాయి. వాటికి మేధయే ప్రధానం కాని మానవుని భావనతోకాని, మానవుని వేదనలతోకాని, అనుభూతితోకానీ వాటికి ఎట్టి సంబంధంలేదు. మానవునికీ విశ్వానికీ గల సంబంధం ఒక మేధస్సువల్లనే తెలుసుకొనడం దుర్లభం. ఈ సంబంధాన్ని తెలుసుకొనడానికి మానవుని ఆంతరంగిక ఆధ్యాత్మిక శక్తు లన్నిటినీ ఉపయోగించవలసి ఉంటుంది. హృదయస్పందనలతో నిమిత్తం లేకుండా మనం ఎన్ని తర్కవాదాలను బోధించినా అవి మానవుని తృప్తిపరచజాలవు. తనకూ విశ్వానికీ గల సంబంధాన్ని గోచరింపచేయవు. ప్రపంచం మిథ్య, ఒక్క భావమే సత్యమని అనవచ్చు. అణు సమాహారమే ప్రపంచ స్వరూపమని అనవచ్చు.

కాంతి, ఉష్ణత, చలనం, ఇవి అన్నీ ఒకే శక్తి యొక్క వివిధ రూపాలని అనవచ్చు. కాని ఈ సిద్ధాంతాలేవీ మానవుని సత్యం వద్దకు చేర్చలేవు. అతనికి స్వస్వరూప జ్ఞానాన్ని ప్రసాదించలేవు.

తనకూ విశ్వానికీ గల సంబంధాన్ని ఒక్క మతం వల్లనే మానవుడు గ్రహించ గలుగుతాడు. 'ఈ ప్రపంచం, ఈ జీవితం, నీకోసమే ఉన్నవి. వీటినుంచి నీకు ఇష్టమైనంత సారాన్ని పీల్చుకో' అన్న విషయాన్ని ఒక్క మతంమాత్రమే బోధిస్తుంది.

'ఈశ్వరుని సంతానమైన మానవజాతిలో నీవూ ఒక సభ్యుడివి. నీ సభ్యత్వ ధర్మాన్ని నీవు నిర్వర్తించు. నీకు పరిపూర్ణత లభిస్తుంది' అన్న సత్యాన్ని ఒక్క మతంమటుకే బోధిస్తుంది.

'నీవు ఈశ్వరానుగ్రహసాధనానికి ఈశ్వరేచ్ఛను నిర్వర్తించు. నీకు విముక్తి లభిస్తుంది' అన్న సత్యాన్ని సైతం మతమే బోధిస్తుంది.

తత్వ వైజ్ఞానిక శాస్త్రముల సిద్ధాంతాలను అవగాహన చేసుకోడానికి కొంత పరిశీలన, పరిశోధన, విద్యా పరిచయం అవసరం. కాని మత సారాంశాన్ని గ్రహించడానికి ఇవన్నీ అవసరంలేదు. మత దర్శనం అందరికీ అందుబాటులో

ఉన్నది. కేవలం అజ్ఞానులు సైతం మతాన్ని అతి సులభంగా గోచరింప చేసుకోవచ్చును.

ఈ విశ్వంలో స్వస్వరూపాన్ని తెలుసుకొనడానికి మానవునికి తత్త్వ వైజ్ఞానిక శాస్త్రాల తాలూకు సిద్ధాంతాలతో పరిచయం ఏంతమాత్రం అవసరంలేదు. పైగా సత్యాన్వేషణకు ఇవి ఆటంకములుకూడా కావచ్చు. ఇహ చింతను కొంత విడిచి విచారిస్తే చాలు-మానవుడు సత్యాన్ని ఇష్టే చేసుకోగలడు. అజ్ఞానులైనా శిశువులైనా సత్యాన్ని గ్రహించగలరు. ఇందుచేతనే కేవలం నిరక్షరాస్యులైన సామాన్యులే క్రైస్తవ మత సారాంశాన్ని మరింత సులభంగా గ్రహించ గలగడం మనం చూస్తున్నాం. చదువుకున్నవారు మటుకు 'క్రైస్తవేతరదృష్టి' అనే కత్తుల బోనులో చిక్కుకుని దిక్కు తోచకుండా ఉన్నారు. షోపెన్‌హార్, బిషప్పులు మొదలైన మేధావులు సైతం అర్థం చేసుకోలేని విషయాన్ని రష్యాలో ఒక సామాన్యుడైన పేదరైతు అర్థం చేసుకోగలుగుతున్నాడు. ఈశ్వర సేవలో ప్రపంచంలోని మహాత్ములతో సైతం ఇతను తులతూగుతున్నాడు.

ఇంతా చెప్పినతరువాత మీరు నన్ను మరో ప్రశ్న అడగవచ్చు. 'వేదాంతంతోనూ, విజ్ఞానశాస్త్రంతోను ఎట్టి సంబంధమూ లేని మతం వల్ల ప్రయోజనం యేమిటి! ఆమతానికి సారాంశం యేమిటి? వేదాంతంతోను విజ్ఞానశాస్త్రం

తోనూ సంబంధం లేకుండా మతాన్ని నిర్వచించటం ఎలా వీలవుతుంది?' ఈ ప్రశ్నలకు నేను ఒకే ఒక సమాధానం చెప్పగలను. మత విజ్ఞానంపైన, యితర విజ్ఞాన శాఖలన్నీ ఆధారపడి వున్నాయి. అన్ని విజ్ఞానశాఖలకు ముందుగా పుట్టింది మతం. అందుచేత విజ్ఞానపరంగా మతాన్ని నిర్వచించటం దుస్సాధ్యమే. వేదాంత పరిభాషలో చెప్పవలెనంటే దీన్ని ఈశ్వర సాక్షాత్కారం అనవచ్చు. 'సాక్షాత్కారము' అన్న పదానికి ఒక ప్రత్యేకమైన గూఢార్థాన్ని అంటుగట్టకుండా వున్నట్లయితే యీ సాక్షాత్కారం అనే పదంలో వున్న అర్థాన్ని మనం సాకల్యంగా అర్థం చేసుకోవటానికి వీలవుతుంది. ఈ సాక్షాత్కారానికి సిద్ధాంత రాద్ధాంతాలు కానీ తర్క వేదాంతాలు కాని శాస్త్రవిజ్ఞానాలుకానీ మార్గాలు కావు. క్రమక్రమంగా యీ సాక్షాత్కారం మానవజాతికి గోచరిస్తూ వచ్చింది.

పదివేల సంవత్సరాల క్రితం వ్యక్తిసంక్షేమం జీవితపరమార్థం అన్న విషయం తెలిసినవారెవరూ లేరు. కాని ఆ తరువాత క్రమంగా మానవజాతి యీ విషయాన్ని గ్రహించ గలిగింది. వ్యక్తిక్షేమాన్ని, కుటుంబ సాంఘిక క్షేమాలను, జాతిక్షేమాన్ని, ప్రభుత్వ క్షేమాన్ని అవగతం చేసుకోగలిగింది. ఆ తరువాత మనుష్యజాతి క్రైస్తవదృష్టిని గూడా తెలుసుకో గలిగింది. ఇలా ఒక్కొక్క ఘట్టంలో

మానవజాతి ఒక్కొక్క వైజ్ఞానిక దశను పొందుతూవచ్చింది. ఇందుకు కారణం యేమిటని మనం విచారించాలి. ఈ కారణాలకు ఆనాటి చారిత్రిక పరిస్థితులను కాని, కాలపరిస్థితులను కాని లేక జీవితపరిస్థితులను కాని అంటగట్టటం తగదు. సూర్యోదయం అయినప్పుడు ఆ కాంతి కొన్ని ప్రత్యేకవస్తువులమీదనే యెందుకు ప్రసరిస్తుందని ప్రశ్నించుకొని అందుకు సమాధానం చెప్పుకొనటానికి యత్నించటం ఎటువంటిదో యిది సైతం అటువంటిదే. విశ్వజీవిత ప్రాగ్దిశవైపు సత్యమనే సూర్యుడు ఉదయించి పైకెక్కుతున్న కొద్దీ ఆ సూర్యకాంతి క్రమక్రమంగా లోకమంతా ఆవరించినప్పటికీ ముందు కొన్ని వస్తువులపైనే ప్రసరించడం సహజం. కొందరు వ్యక్తులు యీ సత్యాన్ని సాక్షాత్కరించు కున్నారంటే అందుకు కారణం, వారి మేధ ఎంతమాత్రం కాదు. వారి హృదయమే అందుకు కారణం. ఇహ చింతలు విడిచినవారికి అనంతమైన విశ్వంతో పోల్చి చూచినప్పుడు తమ అల్పత్వాన్ని గ్రహించినవారికి యీ సత్యం సాక్షాత్కరించింది. వారే మత ప్రవక్తలయినారు; వారు పెద్ద పండితులు కాదు, వేదాంతులు కాదు.

నా వుద్దేశ్యంలో యీ రోజున క్రైస్తవజాతి పురోగతికి ముఖ్యమైన అవరోధం శాస్త్రజ్ఞుల కుతర్కమే. ఒకప్పుడు మోసెస్ మత ప్రవక్తగా వున్నప్పుడు, యీ నాటి మతప్రవ

క్తలు శాస్త్రజ్ఞులు అయిపోయినారు. క్రైస్తవమతంతో అవసరం వున్న దశను మానవజాతి అధిగమించి పోయిందని అంతకుముందు వుంటూవచ్చిన క్రైస్తవేతరదృష్టికి (అనగా సాంఘిక ప్రభుత్వ క్షేమాన్ని దృష్టిలో వుంచుకున్న సిద్ధాంతానికి) మించిన మానవేతర దృష్టి లేదని భావిస్తున్నారు. ఈ దృష్టికలిగిన వారు కావడం వల్ల వీరు క్రైస్తవ మతాన్ని అర్థం చేసుకోలేక పోవటమే కాకుండా క్రైస్తవమతంయొక్క పరిపూర్ణ సాక్షాత్కారం మానవజాతిలో యిప్పుడిప్పుడే ఉదయిస్తున్నదన్న విషయాన్ని కూడా గమనించలేకుండా వున్నారు. శాస్త్రజ్ఞులు చేస్తున్న యీ ముఖ్యమైన పొరపాటుకు కారణంకూడా క్రైస్తవమతానికి పేరు మారమైపోవడమే. క్రైస్తవమతానికీ తమ శాస్త్రవిజ్ఞానానికీ పొత్తు కుదరదని భావించారు. క్రైస్తవమతంలో లోపాలు వుండడం వల్లనే తాము దానికి దూరంగా వుండటం జరిగిందని తమ శాస్త్రవిజ్ఞానంలో యెట్టిలోపాలూ లేవని విశ్వసించారు. వీరి విజ్ఞానశాస్త్రం అంటున్నది క్రైస్తవమతానికి పద్ధెనిమిది వందల సంవత్సరాలకు పూర్వం అన్న విషయాన్ని మరచి, క్రైస్తవమతమే పద్ధెనిమిదివందల సంవత్సరాల పూర్వంవున్నదని వీరు భ్రాంతి పడుతున్నారు.

ఇలా వీరు విషయాలను తారుమారు చేయటంవల్లనే జీవితాన్ని గురించిగాని, నైతిక ప్రవర్తను గురించిగాని,

మత ప్రవక్తలను గురించిగాని శాస్త్రజ్ఞులలో కనిపించినంత గందరగోళం మనకు మరెక్కడా కనిపించదు. ఇంతకన్న విపరీతమైన విషయం యేమిటంటే యీనాడు భౌతిక ప్రపంచంలో అనేక విషయాలను గురించి పరిశోధనలు జరిపి పురోగమిస్తున్న శాస్త్ర విజ్ఞానం మానవులకుగాని మానవ జీవితానికిగాని యెట్టి సహాయం చేయకపోగా పైగా ప్రమాద కరంగా కూడా పరిణమించటం జరుగుతూంది. ఇందుచేతనే విశ్వంతో మానవుని సంబంధాన్ని నిర్వచించ గలిగింది ఒక్క మతమేగాని వేదాంత శాస్త్ర విజ్ఞానాలు కావని నేను నొక్కి వక్కాణించగలను.

ఇప్పుడు మీ రడిగిన మొదటి ప్రశ్నకు సమాధానం చెబుతాను. "మతం అంటే యేమిటి మీ వుద్దేశ్యం——"అని నన్ను ప్రశ్నించారు. మతం అంటే మానవుడు తనకు తన చుట్టూ వున్న అనంత విశ్వానికి, సృష్టి మూలానికి, కారణా నికి ఒక సంబంధాన్ని యేర్పరుచుకోవడమే.

ఈ సమాధానాన్ని అనుసరించి యితర ప్రశ్నలకు కూడా మనం సమాధానం చెప్పుకోవచ్చు.

మతం అనేది మానవుడికీ అతనిచుట్టూ వున్న సంబం ధానికీ సంబంధించిన దృష్టి కావడంచేత యీ దృష్టి జీవిత పరమార్థాన్ని కూడా నిర్దేశిస్తుంది. ఇక నైతిక ప్రవర్తన కూడా యీ సంబంధాన్నే వివరించి వ్యాఖ్యానిస్తుంది.

మానవుడు ఎట్టి సంబంధాన్ని యేర్పరచుకుంటాడో, దానిపైనే అతని నైతిక ప్రవర్తన కూడా ఆధారపడి వుంటుంది. ముఖ్యంగా రెండు సంబంధాలు మనకు విస్పష్టంగా కనిపిస్తాయి. మూడు ముఖ్య నైతిక సిద్ధాంతాలు కూడా మనం గమనించ వచ్చును. ఆదిమ కాలంలో మానవుడు అనాగరికుడుగా వున్నప్పుడు అనగా కేవలం తన వ్యక్తిగత క్షేమాన్నే అన్వేషించినప్పుడు, అనుసరించిన నైతిక విధానం ఒకటి, ఆ తరువాత కుటుంబ సంఘ ప్రభుత్వాలు యేర్పడినప్పుడు మానవుని నైతిక విధానం ఒకటి. ఆ తరువాత క్రైస్తవ తత్వాన్ని మానవుడు దర్శించినప్పటి నైతిక సిద్ధాంతం మరొకటి.

ఇందులో తొలి విధానాన్ని అనుసరించి క్రైస్తవేతర నైతిక విధానాలు రూపొందించబడ్డాయి. ఈ నైతిక సిద్ధాంతాలన్నిటికి కూడా లక్ష్యం ఒక్క వ్యక్తి క్షేమం మాత్రమే. ఇపిక్యూరస్ మొదలైనవారి సిద్ధాంతాలన్నీ దీనికి సంబంధించినవే. మహమ్మదీయుల నైతిక సిద్ధాంతం కూడా వ్యక్తి క్షేమాన్ని దృష్టిలో వుంచుకున్నదే. క్రైస్తవ చర్చి వక్కాణించి చెప్పే సిద్ధాంతం కూడా పరలోకంలో మానవుని వ్యక్తిత్వానికి సంబంధించినది.

వ్యక్తిగత వేదననుండి మానవుడు బయటపడి క్షేమంగావుండాలనే బౌద్ధమతంకూడా యిందుకు సంబంధించినదే నని చెప్పాలి.

ఇక రెండవ విధానానికి సంబంధించిన నైతిక ప్రవర్తనను గురించి వివరిస్తాను. ఈ విధానాన్ని అనుసరించి మానవ జీవితానికి అవసరమైన పరమార్థం సమష్టి సేవ చేయటం. మానవుని వ్యక్తి క్షేమం కూడా సమిష్టిక్షేమంతో పెనవేసుకొని వుంటుంది. రోమన్, గ్రీక్ నైతిక బోధలు యీ దృష్టికి సంబంధించినవి. చైనీయుల నైతిక ప్రవర్తన కూడా యీ దృష్టిని ఆధారంగా చేసుకొన్నదే. వ్యక్తి క్షేమాన్ని సంఘ క్షేమానికి బలిచేయాలనే యూదులవాదం కూడా యిందుకు సంబంధించినదే. కుటుంబ క్షేమంకోసం, శిసుక్షేమంకోసం స్త్రీలు ఆత్మత్యాగం కూడా చేయటానికి పునాది యిదే.

పురాతన చరిత్రలో మధ్య యుగాలనాటి చరిత్రలో దీనికి సంబంధించిన ఆధారాలు మనకు అనేకం కనిపిస్తాయి. కుటుంబంకోసం, సంఘంకోసం, త్యాగాలు చేసిన వ్యక్తులు అనేకులు మనకు కనిపిస్తారు. ఈనాడుకూడా పెక్కుమంది యీ నైతిక సిద్ధాంతాన్నే అనుసరిస్తున్నారు. తాము క్రైస్తవ నైతిక సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నా మనుకున్నప్పటికీ, నిజానికి యిదే విధానాన్ని అనుసరిస్తూ భావి తరానికి కూడా యిదే బోధిస్తూ వున్నారు.

ఇక మూడవ దృష్టి. ఇది క్రైస్తవదృష్టి. మానవుడు యీశ్వరేచ్ఛను బలపరిచే ఒక సాధనం అని యీ దృష్టి

బోధిస్తుంది. ఈ దృష్టినించి అనేక నైతిక సిద్ధాంతాలు బాహిరిల్లాయి. బౌద్ధ బ్రాహ్మణ మతాలకు సంబంధించిన నైతిక సిద్ధాంతాలు, టాయిస్ నైతిక సిద్ధాంతాలూ యీదృష్టి నించీ ఉత్పన్నమైనవే. ఒక్క వ్యక్తిక్షేమాన్నేకాక వ్యక్తి యిచ్ఛనుసైతం త్యజించాలని బోధించే క్రైస్తవ సిద్ధాంతం కూడా యీ నైతిక మార్గాన్నే బోధిస్తుంది. జగత్పిత యిచ్ఛను నిర్వర్తించటానికి తన క్షేమాన్నే కాక తన కుటుంబ, సంఘ, దేశక్షేమాలను సర్వస్వాన్నిసైతం త్యజించాలని క్రైస్తవ మతం బోధిస్తుంది. ఇందుకు సాక్షి మన అంతరాత్మ మాత్రమే. మానవుడు యేవిధమైన నైతిక ప్రవర్తనను అనుసరిస్తున్నప్పటికీ ఆ నైతిక ప్రవర్తన యీ మూడు దృక్పథాలలోనూ యేదో ఒక దృక్పథంనుంచే ఉత్పన్నమైనదని మనం భావించాలి.

వ్యక్తి క్షేమమే జీవిత పరమార్థం అనుకునే మానవుడు వ్యక్తిక్షేమంకోసం యెటువంటి విషయాన్నయినా త్యాగం చేస్తాడు. తన కుటుంబం కోసం, సంఘం కోసం, ప్రభుత్వంకోసం, మానవ జాతికోసం, ఈశ్వరేచ్ఛను నిర్వర్తించటంకోసం తను జీవిస్తున్నానని అతను యెంతగా నటించటానికి యత్నించినప్పటికీ పరీక్షా సమయం వచ్చినప్పుడు యిందులో ప్రతి వొక్కదాన్నీ తన క్షేమంకోసం తృణీకరిస్తాడు.

ఈ విధంగానే కుటుంబ క్షేమంకోసం జీవిస్తున్నాననే వ్యక్తికూడా అందుకోసం దేన్నికానీ తృణీకరించటానికి సంకోచించడు. తను క్రైస్తవుడినని అతను చెప్పుకోవచ్చు. కాని పరీక్షాసమయం వచ్చినప్పుడు తన కుటుంబక్షేమం కోసం క్రైస్తవ నైతిక విధానాన్ని కూడా అతను త్యజించ వచ్చు. ఇదేవిధంగా ఈశ్వరేచ్ఛను నిర్వర్తించటమే మానవ పరమార్థం అనుకునే వ్యక్తి సమస్త సంబంధాలనుకూడా అందుకోసం త్యజిస్తాడు. అతనికి అంతకుమించిన లక్ష్యం యింకేమీ కనిపించదు. కుటుంబంగాని, సామ్రాజ్యంకానీ, మానవజాతి కానీ ఆ లక్ష్యం ముందు అత్యల్పంగా అతనికి కనిపిస్తాయి.

ఇందుచేతనే నైతిక ప్రవర్తనను, మతాన్నీ విభజించి మనం చూడలేం. రెండింటికీ అవినాభావ సంబంధం వున్నది. జీవిత పరమార్థం యేమిటన్న ప్రశ్నకు సమాధానమే మతం. ఈసమాధానంలో నైతికవిధానంకూడా అంతర్లీనమై వున్నది. జీవిత పరమార్థం యేమిటి అన్న ప్రశ్నకు యీ మూడు దృక్పథాలకూ సంబంధించినవ్యక్తులు చెప్పుకునే సమాధానం పైనే వారి నైతిక విధానాలు కూడా ఆధారపడి వుంటాయి. వ్యక్తి క్షేమమే జీవితపరమార్థం అనుకునే వ్యక్తికి అదే జీవిత పరమార్థంగా గోచరిస్తుంది. అందుచేత అతనికి అందుకు ఉప యోగించే పనులన్నీకూడా నైతికంగా గోచరిస్తాయి. సంఘ

క్షేమమే జీవిత పరమార్థం అనుకునే వ్యక్తికి అందుకోసం తను చేసే పనులన్నీ కూడా నైతికంగా కనిపిస్తాయి. ఈశ్వరేచ్ఛను నిర్వర్తించటమే పరమార్థం అనుకునే వ్యక్తికి అందుకోసం తను చేసే సాధన అంతా నైతికంగా కనిపిస్తుంది.

జీవిత పరమార్థాన్ని గురించి మతం చెప్పే వ్యాఖ్యానానికీ నైతిక ప్రవర్తనకూ వ్యత్యాసం వుండదు. కాబట్టి రెండింటినీ విభజించి మనం చూడలేము. క్రైస్తవేతర తత్వవేత్తలు తమ తత్త్వధోరణుల నుంచీ ఉన్నత నైతిక స్వరూపాన్ని ఉత్పన్నం చేయటానికి చేసిన ప్రయత్నాలను చూస్తే మనకు యీ విషయం అవగతమవుతుంది. క్రైస్తవ నైతిక విధానం వినా మన జీవితం సాగదని వీరు భావిస్తారు. క్రైస్తవేతర తత్త్వానికీ యీ నైతిక విధానానికీ ముడి పెట్టటానికి వీరు ప్రయత్నిస్తారు. క్రైస్తవ నైతిక విధానం తమ సాంఘిక తత్త్వంలోనుంచి ఉత్పన్నమైనదేనని రుజువు చేయటానికి కూడా వీరు ప్రయత్నిస్తారు. కాని వీరి యత్నాలన్నీ కేవలం వ్యర్థం. క్రైస్తవ నైతిక విధానానికీ వీటికీ ఎట్టి సంబంధం లేదు.

క్రైస్తవ నీతిని అనుసరించి మానవుడు సంఘ క్షేమం కోసం ఆత్మ బలిదానం చేయడమే కాకుండా ఈశ్వర సేవ కోసం సర్వసంగ పరిత్యాగం చేయవలసి వుంటుంది. క్రైస్తవేతర తత్త్వాలు మటుకు వ్యక్తి క్షేమాన్నీ సంఘక్షేమాన్నీ

మాత్రమే దృష్టిలో వుంచుకుంటాయి. ఇందుచేతనే, యీపరస్పర వైరుధ్యాన్ని కప్పిపుచ్చటానికే అస్పష్టమైన ఆధ్యాత్మిక ధోరణుల తెరచాటున తత్త్వవేత్తలు దాక్కోవటం కూడా జరిగింది.

ఐరోపాలో పునరుజ్జీవన యుగానికి తదనంతరంవచ్చిన అనేకమంది తత్త్వవేత్తలు యిదే పని చేశారు. ఇందుచేత అధునాతన తత్త్వవేత్తల ధోరణులలో మనకు చెప్పరాని అస్పష్టత, సత్యదూరత్వమూ కనిపిస్తాయి. ఒక్క స్పినోజా కాంటిక్ తత్త్వధోరణులు మటుకు క్రైస్తవ నైతికబోధనలకు దూరంగా వుండవు. స్పినోజా తను క్రైస్తవుడుగా భావించకపోయినప్పటికీ అతని తత్త్వవాదం క్రైస్తవ నైతిక విధానానికి దూరమయింది కాదు. వీరు మినహా యితర తత్త్వవేత్తలందరూ, షోపెన్‌హార్ వంటి మేధావులు సైతం నైతిక సిద్ధాంతాలకూ ఆధ్యాత్మిక వాదానికీ కృత్రిమ సంబంధం కల్పించటానికి యత్నించినారు.

తత్త్వధోరణులు నైతిక విధానాలపై ఆధారపడివుండవలసిన అవసరం లేదని, తత్త్వధోరణులలో నుంచీ నైతిక సిద్ధాంతాలను రూపొందించ వచ్చుననే అభిప్రాయంలో వీరు వుండడం వలన, వీరి తత్త్వవిధానాలు క్రైస్తవమత విధానాలను సమర్థిస్తున్నట్లు కనిపించినప్పటికీ అస్పష్టంగా వుండేవి.

సాక్షాత్తుగా జీవిత సమస్యల్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు యీ వైరుధ్యం మరింతగా బయటపడ సాగింది.

'నీషే' యీ వైరుధ్యాన్ని నలుగురికీ తెలియజేశాడు. ఈనాటి తత్త్వధోరణులకు సంబంధించిన నైతిక సిద్ధాంతాలు కేవలం బూటకాలని నీషే అన్నాడు. నిజంకూడా అంతే. దీనివల్ల కొందరు మానవులు అతీతులుగా చలామణీ అయే అవకాశం కూడా వుందని నీషే అన్నాడు. తనకోసం కాక యితరుల కోసం జీవించటమే జీవిత పరమార్థం అని క్రైస్తవేతర మతానికి సంబంధించిన యే దృష్టికూడా మానవుడికి రుజువు చేయలేదు. ప్రతి మనిషీ సహజంగా తన క్షేమాన్ని ఆశిస్తాడు. ఏ క్షణంలో నయినా మృత్యువు తప్పదని ప్రతి మానవుడికీ తెలుసు. అందుచేత తన స్వార్థాన్ని కూడా మానవుడు దృష్టిలో వుంచుకోవటం సహజం. ఈ విధంగా క్రైస్తవ నైతిక విధానాన్ని క్రైస్తవేతర శాస్త్ర విజ్ఞాన ధోరణితో సమన్వయించటానికి ప్రయత్నించారు. ఎవరు ఎన్ని సిద్ధాంత రాద్ధాంతాలు చెప్పినప్పటికీ యీ విషయం మటుకు యదార్థం. ఈ నాటి శాస్త్రవిజ్ఞానానికి మూలమయినది పరిణామ సిద్ధాంతం. మార్పుచెందని ఒక నియతిని అనుసరించి యీ సిద్ధాంతం రూపొందించబడింది. ప్రతి మనిషీ ఉనికికొరకు పోరాటం సాగిస్తాడని, సమర్థుడే యీ పోరాటంలో జయించుకు వస్తాడనీ యీ సిద్ధాంత సారాంశం. అందుచేత

తన సమష్టి క్షేమం కోసం ప్రతివ్యక్తీ సమర్థుడై వుండాలి.

ప్రకృతి శాస్త్రవేత్తలు యీ నియతి ఫలితాలకు భయం చెంది యీ నియతికి సంబంధించిన అర్థాన్ని కొన్ని పదాల వల్ల ఎంత ప్రయత్నించినప్పటికీ అందువల్ల లాభం కలుగకపోగా యీ నియతి మటుకు బలీయంగానే వుంటూంది. ప్రపంచాన్నంతా కూడా పరిపాలిస్తోంది.

నే నీ వ్యాసాన్ని వ్రాయడం మొదలుబెట్టిన తరువాత హాక్స్‌లే వ్రాసిన ఒక వ్యాసం తాలూకు రష్యన్ అను వాదాన్ని పఠించాను. పరిణామాన్ని గురించి, నైతిక ప్రవర్త నను గురించీ ఒక ఆంగ్లేయుల సభలో ఆయన యిచ్చిన ఉప న్యాస సారం అదే. ఆ వ్యాసంలో ఆయన కొన్ని విషయాలు ఋజువు చేయటానికి ప్రయత్నించాడు. మన దేశంలోని ప్రొఫెసర్ డెకలోవ్ వలె మనిషి ఉనికి కోసరమని చేసే పోరాటం అతని నైతిక ప్రవర్తనకు యే విధంగానూ అవ రోధం కాజాలదని అతను ఋజువుచేయటానికి ప్రయత్నిం చాడు. ఇంతేకాక ఉనికికొరకు పోరాటం జీవితానికె మౌలిక మయిందని, యీ పోరాటం లేనిదే జీవితం పురోగతి చెందదనీ ఆయన సిద్ధాంతీకరించాడు కూడా. హాక్స్‌లే వ్యాసంలో అనేక రకాలయిన వ్యంగ్య ధోరణులు, మధ్యమధ్య పద్యాల ఉదాహరణలు కూడా కనిపిస్తాయి. అందుచేత యీ వ్యాసం

లోని అసలు విషయం యేమిటో గ్రహించటం చాలాకష్టం. మొత్తంమీద వెదికి చూస్తే యీ వ్యాసంయొక్క ఉద్దేశ్యం యిలా వున్నట్లుగా తోస్తుంది: పరిణామధర్మం నైతిక ధర్మానికి విరుద్ధంగావున్నది. ఈ విషయం పురాతన గ్రీకులకూ హిందువులకూ తెలుసు. ఆ రెండుజాతులవారి తత్త్వధోరణులూ సర్వసంగ పరిత్యాగ, ఆత్మత్యాగ సిద్ధాంతానికి దారితీశాయి. ఈ సిద్ధాంతం సరిఅయినది కాదు. జగత్తునంతా నడిపించే ఒక నియతి వున్నది. ఈ నియతికి బద్ధులై మానవులు పోరాటం సాగిస్తారు. ఈ పోరాటంలో సమర్థులు మటుకే నిలవగలుగుతారు. ప్రతిమనిషికూడా యీ నియతికిబద్ధుడే. ఈ నియతి వల్లనే మానవుడు ఈ నాడు యీ దశను పొందగలిగాడు. ఈ నియతికీ నైతికప్రవర్తనకూ వైరుధ్యాన్ని యేవిధంగా పరిష్కరించాలి అన్న ప్రశ్నకు ఒక మార్గం కనిపిస్తుంది. విశ్వ పురోగతిని సరిదిద్దే వొక నైతిక నియతి సైతం వున్నది. దీన్ని అనుసరించి ఒక్క సమర్థులే కాక నైతికంగా ఉన్నత దశను పొందినవారు కూడా మనగలగటానికి అవకాశం యేర్పడుతుంది. ఈ నైతిక ధోరణి యే విధంగా ఉత్పన్నమవుతుందో మటుకు హక్స్లే వివరించాడు. కాని తన వ్యాసంలో ఒక చోట మటుకు ఒక విషయాన్ని చెప్పాడు. మనుష్యులుకూడా జంతుజాలం లాగానే తమలో పరస్పరం హాని కలిగించే లక్షణాలను అణుచుకుంటారని, అందుచేత నైతికంగా ప్రవర్తించి

సమష్టిగా మనగలుగు తానని గ్రాహించాడు. సంఘానికి హాని కలుగచేసే యీ రక్షణాలను అణుచుకోవటం వల్లనే సంఘ క్షేమానికి అనుగుణ్యంగా మానవుడు నైతికంగా మనగలుగు తున్నాడని హాక్స్లే సిద్ధాంతీకరించాడు. కాని హాక్స్లే ఒక విషయాన్ని మటుకు మరిచిపోయాడు. ఈ రోజు ఆంగ్ల సమాజంలో మనకు అనేక వైరుధ్యాలు,సమస్యలూ కనిపిస్తున్నాయి. ఐరిష్ సమస్య, క్రింది తరగతులవారి దారిద్ర్యం, ఉన్నవారి భోగలాలసత్వం, వ్యాపార రాజకీయ ప్రయోజనాల కోసం కొన్ని జాతులను హింసించి వెళ్ళగొట్టటం-యివన్నీ కనిపిస్తు న్నాయి. పోలీసుల నియమాలను అతిక్రమించని ప్రతిమనిషీ నైతిక ప్రవర్తన కలవాడుగానే భావించబడుతున్నాడు. కాని, యీ నీతి ఎంతవరకు సత్యం? దొంగల గుంపుకు చేరిన ఒక దొంగ తన ముఠా కోసం అనుసరించే నైతిక నియతి వంటిదే యీ నీతికూడా.

నీతి అనేది క్షణక్షణం అభివృద్ధి చెందే విషయం. నీతిని గొడ్డళ్ళద్వారాను ఉరికంబాల ద్వారాను మనంకాపాడ లేము. పైగా అలా కాపాడాలని యత్నించడం నీతికే విరుద్ధం అవుతుంది. పైగా ఉన్న వ్యవస్థపై చేసిన ప్రతి తిరుగుబాటూ నీతివిరుద్ధంగానే కనిపిస్తుంది. సైన్యంలో చేరక పోవడం, యుద్ధపు పన్నులను చెల్లించక పోవడంకూడా నీతిని భంగపరచినట్లే అవుతుంది. ఇది వితండవాదమే.

తన తోటిమానవులను భక్షించడం పోరాటాన్ని అనుకున్న ప్రతివ్యక్తీ సాంఘిక వ్యవస్థకు భంగం కలిగించినట్లే అవుతాడు. అందుచేత అతడుచేసే ప్రతిపని కూడా నీతికి వ్యతిరేకంగానే భావించబడుతుంది. నీతికోసం చేసే ప్రతిపనీ కూడా సాంఘిక వ్యవస్థకు వ్యతిరేకంగా వున్నట్లు కనిపిస్తుంది. అందుచేత తమ స్వప్రయోజనాన్ని గురించి సంఘంకోసం ప్రజలందరూ ఒక నైతిక సూత్రాన్ని అనుసరిస్తున్నారంటే, అందులో మనిషి ఉనికికోసం చేసే పోరాటమే అంతర్లీనమై వుంటుంది. ఉనికికోసం పోరాటం సాగుతుందనీ సమర్థులయిన వ్యక్తులు మాత్రమే జీవిస్తారు అన్నదీ జీవిత నియతి అయితే సాంఘిక పురోగతి గాని, సాంఘిక పురోగతికి సంబంధించిన యే నైతిక సిద్ధాంతం గానీ యీ నియతికి భంగం కలుగ జేయలేవు.

సాంఘిక పురోగతిలో మానవులు సంఘాలుగానో వర్గాలుగానో యేర్పడుతారని హక్స్లే అంటాడు. అప్పుడు ఉనికికోసం అని జరిగే యీ పోరాటం కుటుంబాల్లోకి, వర్గాల లోకి, జాతులలోకి కూడా వ్యాపిస్తుంది. అప్పుడు యీ పోరాటంయొక్క రూపం నీతికి విరుద్ధమయింది కావటంమాట అలావుంచి అంతకన్నా భయంకరమైన పరిణామాన్ని పొందు తోంది. ఒక వెయ్యి సంవత్సరాల తరువాత మానవజాతి అంతా యేక కుటుంబంగా యేర్పడి ప్రపంచంలో ఒకే

ప్రభుత్వం యేర్పడుతోందని మనం ఊహించినప్పటికీ అప్పుడుకూడా వ్యక్తులమధ్య, కుటుంబాలమధ్య, జాతులమధ్యా యీ పోరాటాలు నశించవు. ఈ రూపంలో కాకపోతే మరొక రూపంలోనో, లేక కొత్త కొత్త రూపాలలోనో యీ పోరాటం సాగుతుంది. ప్రభుత్వంలోకూడా యింతే. ఈ రూపంలో కాకపోతే అనేక రూపాలలో యీ పోరాటం సాగుతుంది. బాణాలతోనో, కత్తులతోనో హత్యలు ఒక మాటు జరిగితే మరోమాటు ఆకలితోనే మానవులు మరణించటం జరుగుతుంది.

సాంఘిక పురోగతివల్లనే నైతిక ప్రవర్తన ఉత్పన్నమవుతుందని అనుకోవడం కుంపట్లు తయారుచేసి నిప్పు తయారయిందని అనుకోవడమే అవుతుంది. ఉష్ణత అన్నది సూర్యగోళంనుంచి ఉద్భవిస్తున్నది. బొగ్గులువేసి నిప్పు రాజవేసినప్పుడే కుంపట్లు రగులుకొంటున్నాయి. ఈ విధంగానే నైతిక ప్రవర్తన అన్నది కూడా మతం నించే ఉత్పన్నమవుతూన్నది. సాంఘిక జీవితానికి సంబంధించిన యితర రూపాలు నైతిక ప్రవర్తనను మత ప్రభావం వున్నప్పుడు మాత్రమే రూపొందించగలవు.

కుంపట్లను వెలిగించవచ్చును, వెలిగించక పోనూవచ్చును. ఈ విధంగానే అనేక సాంఘిక నియమాలు నైతిక ప్రవర్తనకు అనుగుణ్యమయినవే కావచ్చు, కాకపోనూ వచ్చును.

క్రైస్తవ నీతి సాంఘిక దృష్టికి పునాదిగా కలిగింది కాదు. ఇంతేకాక క్రైస్తవేతరమయిన సాంఘికదృష్టిని, క్రైస్తవ నీతినీ సంఘటిత పరచటంకూడా దుస్సాధ్యమైన విషయమే. మతానికి సంబంధంలేని ఎన్ని నీతులయినా చెప్పవచ్చును. వాటిని ప్రజలు అనుసరిస్తారనికూడా భావించవచ్చును. కాని నిజం ఆలోచిస్తే ప్రజలు అనుసరిస్తున్న నీతి నియమాలు యివి కావు. సంప్రదాయానుగుణంగా తమ మతాలుచెప్పిన నీతి నియమాలను ప్రజలు అనుసరిస్తున్నారు.

మత భావనతో సంబంధంలేని నైతిక బోధనకు ఒక పోలిక చెబుతాను. సంగీత శాస్త్రంలో ఓనమాలు తెలియని ఒక వ్యక్తి అనుభవజ్ఞులయిన సంగీత శాస్త్రజ్ఞులకు స్వరమేళ ప్రారంభించమని చేతులూపటం వంటిదే యిది. అందువల్ల వాద్యగాండ్రు తమ సంగీతం ప్రారంభించవచ్చు కాని, అది ఆ వ్యక్తి చేతులూపటం వల్లనే ప్రారంభ మయిందని మనం ఊహించలేముకదా! వారు సంగీతం వచ్చినవారు కనుక, సంగీతం ప్రారంభమయింది. ఒక్కొక్క సారి యిలా చేయటంవల్ల వారిలో కొంత గందరగోళం కూడా బయలుదేరవచ్చు. ఈ విధంగానే యీ నాడు సంప్రదాయానుగుణ్యమైన మతంతో నిమిత్తం లేకుండా ఉత్పన్న మవుతూన్న అనేక సిద్ధాంత రాద్ధాంతాలవల్ల ప్రపంచంలో అల్లకల్లోలం చెలరేగుతున్నది.

మూఢ విశ్వాసాన్ని నైతికబోధకు జోడించటం వాంఛనీయం కాదనే విషయం వాస్తవమే. కాని నైతిక బోధకు, మానవునికీ ఈశ్వరునికీ వున్న సంబంధానికీ ఏట్టి పొత్తూ లేదనడం భావ్యంకాదు. ఒకవేళ యిట్టి సంబంధాన్ని మూఢ విశ్వాసాల రూపంలో వ్యక్తీకరించి వున్నప్పటికీ మనం వాటిని మరింత హేతుయుక్తంగానో స్పష్టంగానో నిర్వ చించటానికి ప్రయత్నించాలిగాని మతమే మూఢ విశ్వాసమని భావించడం పొరపాటు.

మతంతో సంబంధం లేకుండా, నైతిక ప్రవర్తన వున్నదని భావించడం, బాలురు తమ కంటికి నచ్చిన పూవును మారుపాదుచేసి మొక్క మొలిపించటానికి యత్నించడం వంటిది. ఒక లత పూచిన పూవును గిల్లి మరో లతకు అంటగట్టి ఆ పూవును పూయించాలని యత్నిం చడం యెంత హాస్యాస్పదమో యిది కూడా అంతే! అందుచేత మతం వినా నైతిక ప్రవర్తన అనేది వుండటం అసాధ్యం అని గట్టిగా చెప్పగలం. మీ ప్రశ్నకు ఒకే ఒక సమాధానం చెప్పాలంటే యిదే నా సమాధానం! మానవుని ప్రత్యేక వ్యక్తిత్వానికి, అతని చుట్టూ వున్న విశ్వానికీ వున్న పరస్పర సంబంధమే మతం. ఈ సంబం ధాన్ని పురస్కరించుకుని నైతిక ప్రవర్తన కూడా రూపొందు తుంది. ఆ నైతిక ప్రవర్తన జీవిత నావకు చుక్కానివంటిది.

(డిసెంబర్ 28; 894)

3

# మతం : హేతువాద వివేకం

మత విషయికంగా మీరు నన్ను మరి కొన్ని ప్రశ్న లడగవచ్చు.

1. ప్రత్యేక ప్రతిభా విశేషాలు లేని వ్యక్తులు, తమ అంత ర్జీవితానుభూతిని గురించి, అంతర్జీవితాన్వేషణలో తాము సాధించిన సత్యాలను మాటలద్వారా వ్యక్తీక రించడానికి యత్నించడం సమంజసమేనా ?

2. అంతర్జీవిత సత్యాన్ని గురించిన పరిపూర్ణ సాక్షాత్కారాన్ని పొందడానికి యత్నించడం సబబేనా ?

3. కొన్ని సమస్యలను మనం ఎదుర్కొనవలసి వచ్చిన విపత్కర విషమ సమయాలలోను, తెగిపోని సంశ

యాలు మనలను వేధించే క్షణాలలోను, మనకు సరియైన బాట తెలియచేసేది మన అంతరాత్మా? లేక మన లోపాల అయస్కాంతాల ఆకర్షణలకూ ప్రేరేపణలకూ లొంగిన మేధస్సా?

పై మూడు ప్రశ్నల సారాంశం రెండవ ప్రశ్నలోనే ఇమిడి ఉన్నదని నేను భావిస్తున్నాను. అందుకు కారణాలను కూడా వివరిస్తాను. అంతర్జీవిత సత్యాన్ని పరిపూర్ణంగానూ విస్పష్టంగానూ సాక్షాత్కరింప చేసుకోడానికి మనం యత్నించి తీరాలి. అలా మనం యత్నించని పక్షంలో ఆ సాధనలో మనం తెలుసుకున్న సత్యాలను వెలిబుచ్చడం సాధ్యమూ కాదు, సబబూ కాదు. సంశయాలు మనల్ని ముసిరినప్పుడు మనకు బాట చూపేది అంతరాత్మా లేక మేధస్సా అని వివేచించడం కష్టమే. కాని మనం మన మనోశక్తులు సాధించ గలిగినంత మేర అంతర్జీవితాన్ని పరిపూర్ణంగా సాక్షాత్కరించుకో గలిగినట్లవుతే ఆ సాధనలో అవగతం చేసుకున్న సత్యాలను మాటలద్వారా చెప్పడం కూడా అవసరం. ఆ మాటలద్వారా మనం సంశయ సాగరాన్ని తరించ వచ్చు.

అందుచేత మీరడిగిన ప్రశ్నకు అవుననే సమాధాన మిస్తాను. మానవుడు తన జీవితాన్ని సార్థకం చేసుకొనడానికి తను అనుసరించే మతాన్ని పునాదులతో సహా సమగ్రంగా

అవగతం చేసుకోనడానికి యత్నించాలి. అలా సమగ్రంగా అవగతం చేసుకున్ననాడే మానవజీవితం సార్థకమవుతుంది.

చదువు, సంధ్యలు లేనివారిలో ఒక అభిప్రాయం ఉండడం నేను గమనించాను. వారి మట్టిత్రవ్వకానికి లెక్క ప్రకారం కూలిఇచ్చినప్పుడు వారు సాధారణంగా ఆ లెక్కను నమ్మరు. వారికి లెక్కలు తెలియకపోవడం వల్లనో లేక వారు త్రవ్విన మట్టిని తూచే విషయంలో యజమానులు వారిని దగా చేసి ఉండడం వల్లనో ఇలా జరుగుతూ ఉంటుంది. మొత్తంమీద మట్టిత్రవ్వకానికి కూలి, లెక్కప్రకారం కట్టడం అసాధ్యమనే నమ్మకం ఈ కూలి జనంలో పడిపోయింది. మతంలో నమ్మకం లేనివారిలో కూడా ఇలాటి నమ్మకమే ఉన్నది. హేతువాదం మతానికి సంబంధించిన సమస్యలను ఏ విధంగానూ పరిష్కరించలేదని, హేతువాదం ద్వారా మత సమస్యలను పరిష్కరించడానికి పూనుకోనడం వల్లనే పొరబాట్లు జరుగుతూ ఉన్నవని, హేతువాదం ద్వారా మత సమస్యలను అవగతం చేసుకోనడానికి యత్నించడం కేవలం 'అహం' తప్ప మరేంకాదనీ వీరి నమ్మకం.

మతసమస్యలను అవగతం చేసుకోనడానికి హేతువిచారణ మార్గం కాదని అనుకోనడం వల్లనే మతాన్ని పరిపూర్ణంగా అవగతంచేసుకోనడానికి యత్నించడం సాధ్యమా, అసాధ్యమా అనే సంశయం కలుగుతున్నది. కాని ఈ

సంశయం కేవలం ఆధార రహితమైనది. గణితంద్వారా గణిత సమస్యలను పరిష్కరించ లేమని భావించడం ఎలాటిదో ఈ సంశయం కూడా అలాటిదే.

తనను తాను గుర్తెరగడానికికాని, లేక తనకూ, తన చుట్టూగల విశ్వానికీగల సంబంధాన్ని గుర్తెరగడానికికానీ భగవంతుడు మానవునికి ఒకే ఒక సాధనాన్ని ప్రసాదించాడు. 'హేతు విచారణ' అనే జ్ఞాన చక్షువుద్వారా మాత్రమే మానవుడు ఈ విషయాలను తెలుసుకోనగలడు. కాని ఈ జ్ఞాన చక్షువును మానవుడు పరి పరి విధాలుగా ఉపయోగిస్తున్నాడు. కాని ముఖ్యంగా ఈ జ్ఞాన చక్షువు ఎందుకోసం ప్రసాదించబడిందో ఆ విషయంకోసం మాత్రం వినియోగించడంలేదు. గృహ, కుటుంబ వ్యవహారాలను చక్కబరుచుకోడానికి, రాజకీయ, వ్యాపార, శాస్త్ర, కళా సమస్యలను అవగతం చేసుకోనడానికి ఈ జ్ఞాన చక్షువు వినియోగించబడుతున్నది. కాని సత్య వస్తు సాక్షాత్కార సాధన కొరకు మటుకు వినియోగింప బడడంలేదు.

హేతువు వినా మానవుడు ఏ విషయాన్నీ సమగ్రంగా అర్థంచేసుకోనలేడు. మతంలోని అంతస్సత్యాన్ని తెలుసుకోనడానికి హేతువుతో అవసరంలేదు. కేవలం ప్రేరేపణ ద్వారాను, విశ్వాసం ద్వారానూ మతంలోని అంతస్సత్యాన్ని గ్రహించవచ్చు నని కొందరంటారు. కాని

ఈ విశ్వాసం సైతం హేతువుకు విరుద్ధమైనది కాదు. హేతు విచారణ ద్వారా విశ్వాసం ఏర్పడదు. ఒక మనిషి ఒక విషయాన్ని విశ్వసిస్తున్నాడూ అంటే అందుకు కారణం హేతువిచారణే. మరొక విషయంలో అతనికి విశ్వాసం కుదరడం లేదంటే అందుకు కారణం కూడా హేతు విచారణే. హేతు విచారణ విచక్షణాజ్ఞానము లేనిదే ఒకదానిలో విశ్వాసం కుదరడం కాని, కుదరకపోవడంకాని దుస్సాధ్యం. చీకటి బిలంలో దీపం పట్టుకుని నడుస్తున్న వ్యక్తికి దీపం మార్గం చూపదనిఅనడం ఎలాటిదో హేతు విచారణతో నిమిత్తం లేదనడంకూడా అలాటిదే.

మీరు మరొక సంశయాన్ని వెలిబుచ్చారు. మనుష్యులందరికీ మేధస్సంపత్తి ఒక విధంగా ఉండదని, అందుచేత తక్కువ మేధస్సంపత్తి గలవారు తమ భావాలను సరిగా వ్యక్తీకరించక పోవటంవల్ల పొరబాటు జరగవచ్చునన్నారు. ఈ సంశయానికి సమాధానంగా సత్యసందేశం (గాస్పెల్)లో జీసస్ చెప్పిన మాటతే చెబుతాను. 'విజ్ఞానులు గ్రహించలేని రహస్యం సైతం ఒకొక్కసారి పసిబిడ్డలకు గోచరిస్తుందని' అన్నారు జీసస్. జీసస్ అన్న ఈ మాట అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. పైగా ఈ మాటలో పరస్పర వైరుధ్యం కూడా ఎంతమాత్రం లేదు. (గాస్పెల్‌లో తమకు ఇష్టంకాని ఉపదేశాలను అతిశయోక్తులుగా కొందరు భావిస్తారు.)

పైగా ఈ మాట పదహారణాల సత్యం. ప్రపంచంలో ప్రతి వ్యక్తికీ ఒక ధర్మం నిర్ణీతమై ఉన్నది. ఆ నియతికి బద్ధుడై ఆ మానవుడు సంచరిస్తాడు. ఈ ధర్మాన్ని అవగతం చేసుకొనడానికి ప్రతి మానవునికీ అవసరమైన సాధనాలు ప్రసాదించబడినవి. అందుచేత వివేచనా జ్ఞానంలేని మానవుడంటూ ఉండడు. ఈ జ్ఞానంద్వారానే ప్రతి మానవుడూ తన జీవన నియతిని అవగతం చేసుకుంటాడు. ఈ నియతి అనుసరించడానికి ఇష్టంలేని వ్యక్తికిమటుకే ఈ వివేచనా జ్ఞానం ఉండదు. అలాటి వ్యక్తి వివేచనా జ్ఞానాన్ని కాదని ఎవరెవరో చెప్పిన మాటలను గుడ్డిగా నమ్మడం, విశ్వాసమే దారి చూపుతుందని అనుకోడం జరుగుతుంది.

మానవుడు అనుసరించవలసిన నియతి ధర్మం అవగతం చేసుకొనడం క్లిష్టంకాదు. ఎంతో సులభంకూడా. ఆఖరుకు శిశువు సైతం ఈ ధర్మాన్ని అవగతం చేసుకొనగలడు. నిర్ణీతమై ఉన్న జీవన ధర్మాన్ని తెలుసుకొనడం కోసం మానవుడు ప్రత్యేకంగా కష్టపడవలసిన అవసరంలేదు. మన ముందు తరాలవారందరూ ఈ విషయాన్ని తెలుసుకుని ఈ విషయాన్ని గురించి తమ తమ భావాలను వెలిబుచ్చారు. ఈ సంప్రదాయంలో చెప్పబడిన విషయాలు ఎంతవరకు సమంజసమైనవి అని సరిచూచుకొనడమే ఇప్పుడు మనం చెయ్యవలసిన పని. అది సమంజసంగా తోచిన పక్షంలో

వాటిని మనం అనుసరించవచ్చు; లేదా తిరస్కరించవచ్చు. కాని సంప్రదాయానికి మన వివేచనా జ్ఞానం లొంగడం మంచిది కాదు. సంప్రదాయమే మన హేతు విచారణకు అదుపులో ఉండాలి.

సంప్రదాయాలు మానవ నిర్మితాలు. అందుచేత అవి దోషభూయిష్ఠమైనవి కావచ్చును. కాని భగవద్దత్తమైన వివేచనా జ్ఞానం మటుకు దోషభూయిష్ఠం ఎన్నటికీ కానేరదు. అందుచేత ఈసత్యాన్ని అవగతంచేసుకొనడానికి కాని, వ్యక్తీకరించడానికికానీ ప్రత్యేకమైన మేధస్సంపత్తితో నిమిత్తం లేదు. వివేచనా జ్ఞాన మనేది మానవ లక్షణా లన్నిటిలోకీ మహోన్నత మైనదని, సత్య సాక్షాత్కారమునకు ఇంతకన్న మరొక సాధనం లేదనీ మనం విశ్వసించవలసి ఉంటుంది. ప్రత్యేక ప్రతిభా విశేషాలు కావలసినది సత్యాన్ని తెలుసుకొనడానికి కాదు.

అసత్యాన్ని కనిపెట్టి ప్రచారం చెయ్యడానికే ప్రత్యేక ప్రతిభా విశేషాలు అవసరం!

హేతు వాదాన్ని, వివేకాత్మకమైన ప్రేరేపణలను త్యజించడమే తరువాయి, ఇక ఎన్నో విధాలైన విపరీతమైన అసహజ విషయాలలో మనుష్యులకు నమ్మకం ఏర్పడుతుంది. విపరీత విషయాలు, ధర్మాలని, సాక్షాత్కారాలని, మూఢ

విశ్వాసాలనే ఎన్నెన్నో నకాల రూపాలను ధరిస్తాయి. అగ్రహిత మైన ఒక సత్యంతో ముడిపెట్టాలంటే అందుకోసం లక్షలపేచీ లను ఊహించగల కుటిలబుద్ధి అవసరం. ఎంతటి సామాన్యు డైనా తను చిన్ననాడు నేర్చిన మతాన్ని తన జీవితంతో అన్వయించుకుని అవగతం చేసుకొనవచ్చును. కాని, ఆచిన్న నాటి మతంలోని మూఢనమ్మకాలన్నిటినీ సరి పెట్టడానికి ఎంతో శ్రమపడవలసి ఉంటుంది. కేవలంగా మంచికి మరో రూపమైన దేవుడు - కాని ఆ దేవుడే చెడునుకూడా సృష్టించి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసే భారాన్ని తనపై వేసుకుంటాడని నమ్మాలి. ఒక వైపున ప్రేమధర్మాన్నీ క్షమాధర్మాన్నీ బోధిస్తూ మరోవైపున యుద్ధాన్ని సృష్టించడం, పేదలను దోచుకొనడం మొదలైన కార్యక్రమాలు సాగిస్తూ ఉండాలి.

ఈ పరస్పర వైరుధ్యాలను కప్పిపుచ్చడానికి ఎంతెంత తెలివి తేటలు అవసరమో ఇక చెప్పనలవి ఉందంటారా? కాని తమ జీవనధర్మాన్ని అవగతం చేసుకొనడానికికాని, తాము చిన్ననాడు నేర్చిన మతంలో అంతరార్థాన్ని పరి పూర్ణంగా సాక్షాత్కరింప చేసుకొనడానికికాని ఎట్టి తెలివి తేటలూ అవసరం లేదు. ఇందుకు మనం మన వివేకానికి విరుద్ధంగా ఉండకపోతే చాలు. వివేకంచూపే బాటను అనుస రిస్తే చాలు. ఒక మనిషికి అతనిజీవిత పరమార్థం గోచరించ

లేదంటే అందుకు కారణం అతని వివేకశక్తి లోపభూయిష్టం కావటంకాదు. అందుకు కారణం అతను వివేకానికి దూరమైన అనేక విషయాలను నమ్మాడని మాత్రమే. ఆ వ్యక్తి ఆ విష యాలను అవతలఉంచి వివేకంతో చూడగలిగితే అతనికి సత్యం గోచరించి తీరుతుంది.

ఏతావతా, నేను అనే దేమిటంటే, అంతర్జీవిత సత్యాన్ని గ్రహించడానికి ప్రతిమనిషీ యత్నించడం అవసర మని. ఇహలోకంలో మన జన్మకు కారకుడైన ఈశ్వరుని ఇచ్ఛను శాయశక్తులా నిర్వర్తించడమే జీవితలక్ష్యం. అదే జీవిత పరమార్థం. కాని ఈ ఈశ్వరేచ్ఛను తెలుసుకొనడానికి మార్గాలు మంత్రాలు, తంత్రాలూ కావు. ఏదో ఒక మత గ్రంథంలో ఇలా రచింపబడి వున్నదనికాని, ఎవరో మహా త్ముడు ఇలా బోధించాడని కాని—ఆ విషయాలను ఆధారంగా చేసుకుని మనం ఈశ్వరేచ్ఛను తెలుసుకొనవలసిన అవసరం లేదు. మానవసహజమైన వివేకమే ఈశ్వరేచ్ఛను తెలుసుకొన డానికి మార్గం. మనో వాక్కాయ కర్మలద్వారా వివేకం చూపిన బాటను తు-చ తప్పకుండా అనుసరిస్తే ఈశ్వరేచ్ఛను పరిపూర్ణంగా అవగతం చేసుకోగలం. జ్ఞానం అన్నది ఒక ముద్దలాంటిది కాదు. మానవజాతి పురోగతితోపాటు జ్ఞానం కూడా అభివృద్ధిచెందుతూ ఉంటుంది. క్రమక్రమంగా ఈశ్వ

రేచ్ఛ మరింత స్పష్టరూపంలో మనకు గోచరిస్తూ ఉంటుంది. అందుచేత మానవుడు తను గ్రహించిన సత్యాన్ని ఇతరులకు తెలియచెయ్యడం ఎంతో అవసరం. స్పష్టతకు చిహ్నం ఒక విషయాన్ని మాటలద్వారా తెలియచెయ్య గలగడమే. ఇలా తెలియచెయ్యడం మానవుని విధ్యుక్తధర్మం.

నా జవాబు తమకు ఇంతో అంతో సంతృప్తి కలగ జేసిన పక్షంలో నేనెంతో సంతోషిస్తాను.

(నవంబర్ 26, 1894)

JEEVITHAMU - MATHAMU    PRICE : R

దక్షిణభాషా పుస్తకసంస్థ సహకారమున ప్రకటి



# గ్రంథం : గ్రంథకర్త

చరిత్రలో చిరంజీవులైన మహా పురుషులలో, ప్రముఖ రచయితలలో కౌంట్ లియో టాల్‌స్టాయి ఒకరు. ప్రపంచంలోని ముఖ్యమైన భాషలలో ఆయన రచనలను అనువదించుకోని భాష లేదు. మానవజీవితంలో మతం, నీతి, హేతువాదం మొదలైన ప్రముఖాంశాలపై ఆయన ప్రవచనాలు ఈ గ్రంథంలో సరళంగా తెనిగింపబడినవి.

బ్రాహ్మ, బౌద్ధ, హీబ్రూ, టావో, కన్‌ఫ్యూషియస్, క్రైస్తవ, మహమ్మదీయ మతాలలోని మూలసిద్ధాంతాల సారమే టాల్‌స్టాయి మతం. నిజానికి అదే మానవులందరికీ సమ్మతం కాదగిన మతం అవడమే ఆ రష్యన్‌ఋషి అభిమతం.

* * *

రవీంద్ర గ్రంథమాల,
విజయవాడ - 2.